శ్రీ ర స్తు.

# బెడుదూరు హరిశ్చంద్ర నాటకము.

శ్రీమదుభయ వేదాంత ప్రవర్తకుల రగు

శ్రీమాన్, బెడుదూరు రామాచార్యులచేతను

శ్రీమాన్, బెడుదూరు కందాళ్ళ రంగాచార్యులచేతను

రచితము.




బరూరు, త్యాగరాయశాస్త్రిలు అండ్ సన్ వారిచే

సర్వస్వతంత్రమును పొంది

యన్. వి. గోపాల్ అండు కో.,

ఆనందభారతి పవర్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపట్టణము.


 1950 [దీనివెల 0-12-0

# చంద్రామృతము.

ఇది ఒకటి యింటనుండగా వేరే వైద్యుడు అవసరంలేదు. అన్ని రోగములను పోగొట్టును. ప్రతివారివద్దను ఉండతగినది రసవిష గంధకాదులు కలియులేదు. దీనిని పైకిపూసిన యెడల వాతనొప్పులు, కీళ్ళనొప్పులు మొదలగు నొప్పులు, గజ్జి తామర, చిడుము మొదలగు చర్మవ్యాధులు నిర్మూలమగును. కొన్నిబొట్లు నీళ్ళలో విడచి పుచ్చుకొనిన శీతజ్వరము, కడుపునొప్పి, అజీర్ణము, శూల, దగ్గులు, కడుపులోబల్ల, శీత వాత కఫ పైత్యరోగములు, మూలవ్యాధి, బలహీనము మొదలగు సకలరోగములను పోగొట్టును. పథ్యములేదు. వివరకాగితము మందుతోగూడా పంపబడును. సీసా **1-8-0**

# శెగరోగనివారణి.



మూత్రము వెడలునపుడు పోట్లు, మంటలు, మూత్రద్వారము నుండి తెల్లగాగాని, పచ్చగాగాని చీమువంటి ద్రవము వెడలుట, పొత్తికడుపు నరములు బిగదీయుట, మూత్రకోశమున బొట్లు తరుచుగా విసర్జనము చేయుట, మూత్రము బొట్లుబొట్లుగా వెడలుట మొదలగు గుణములతో నీరోగము ప్రారంభించిన వెంటనే ఈ ద్రావకము యేడుపూటలు సేవించిన నాళముదగ్గర పుండుమాని చీమువంటి ద్రవముకట్టి మూత్రము ధారాళముగా వెడలును. నాళములయందలి జిలజిల మానును ఈ ద్రావకము పాత శెగరోగములనుకూడ నతిత్వరలో మాన్పును. **1-4-0**

# చెవినొప్పి తైలము.

చెవిలో చీముఉన్నయెడల సోబును కరుగదీసి ఆజలమును సిరంజిలోనెత్తి చెవిలో విడచి కడిగి తడిలేక తుడిచి దూదిపెట్టి అణచవలయును. చెవి, గొంతు, వాత నొప్పిగలిగియుండిన నీళ్లుకాచి కంబళితో తడిపి పిండివేసి వేడి ఆరకమునుపే ఒత్తించవలెను. నొప్పియున్నచోట ఆదిజనూనె నరుసుమవలయును. నొప్పిస్వస్థమగునంతవరకు ఔషధము రాయవలయును.

2 బుడ్లు **1-0-0**

# నేత్రాంజనము.



ఈ తైలము ప్రతిదినము ఉదయం కన్నులలో ఉపయోగించిన యెడల కన్నునొప్పి, పోట్లు మసకబడుట, నీరు కమ్ముట, మబ్బుగా నుండుట, పుసికట్టుట, కండ్లెరుపుట, [illegible]

సీసాలు **1-0-0**

---

యమ్. వి. గోపాల్ అండు కో., నెం. 63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, మద్రాసు.

శ్రీరస్తు

బెడదూరు శ్రీ వేంకటాచల రమణాంకితం బగు

# హరిశ్చంద్రనాటకము.

***



లీలన్ బెడదూరు మందిరమునన్ జెన్నొందు విన్నాణమా॥
శైలాగ్రంబున నిల్చి భక్తజనతా సంరక్షణాపేక్షన్శ్రీ।
నీళాకాంతలతోడఁగూడి నలస న్నీరేజపత్రేక్షణుం।
డాలావణ్యుఁడు వేంకటేశ్వరుఁడు యిష్టావ్యాప్తి మాకుతన్॥

ఉ॥ అంబరకేశు నాదుహృదయాబ్జమునందు దలంచి మ్రొక్కి హే। రంబుఁ నుతించి ధాతను దీరంబుగ నెంచుచు వాక్సతీలలా।మంబును భక్తిచే బొగడి మత్కృతి బ్రోచుటకై నుతింతు హా।స్తాంబుజయుగ్మమున్మొగిచి సాదను సైంధవకంధరాహ్వయున్॥ తే॥గీ॥ జగతి బ్రాచేతసుని బరాశరతనూజు। కాళిదాసాదిసంస్కృతకవుల దలచి। నన్నపార్యుని భక్తిచే సన్నుతించి। తిక్కయజ్వకు వేడ్కతో మ్రొక్కి వేడి॥ తే॥ గీ॥ నిర్మలాంగంబులందుల నిలుచు టుడిగి। ప్రణములకు బారుమక్షికప్రజము భంగి। సరళపదగుంబనార్థములే సరకుగొనక। దప్పులెంచెడి కుకవిసంతతుల దెగడి॥

మాటలు॥ అని ఇష్టదేవతాప్రార్థనంబును, సుకవినమస్కారంబును, కుకవి కుర్కుర ధిక్కరణంబునున్ గావించి లోకంబునకు రమ్యం బగు నొక్కనాటకం బొనర్చి మద్వంశంబు నభివర్ణించెద॥

ఉ॥ ఎల్లజగంబులందు నుతికెక్కిన శ్రీమహానియ్యమూర్తి కొండాళ్ళ కులాబ్ధిసంభవసుధాంశుఁడు మజ్జనకుండు గోత్రసం।పుల్లసితోత్పలంబులను మోదమెలర్పగ బ్రోచె కీర్తిశో।భిల్లగ శేషయార్యుఁడను పేర మహావిభవాభిరాముఁడై॥ తే॥గీ॥ అతఁడు శ్రీరంగకులజుఁడై యలనుకృష్ణ। యార్యుఁడనునాగురునకసహాయునుకవి। కనుగుచెల్లియలైన లక్ష్మాంబ ముసనెడి। సతిని వరియించి నను గాంచె క్షితితలమున॥ క॥ వాధూలసగోత్రంబున। సాధులుకొని। యాడ నేను జననంబై శ్రీ। నాధానుగ్రహమున గవి।తాధారను సుకృతి విరచితాత్ముఁడ నైతిన్॥ తే॥ గీ॥ రామకవివర్యుఁడను కడురమ్యమయిన ఈహరిశ్చంద్రనాటక మిలి బ్రసిద్ధి। గాగ కృతి జేసి యర్పింతు కవులు బొగడ వేంకటాచలపతిపేర నంకితముగ॥

యుండ, మనమెంతవారమనుదుర్బుద్ధిచే నూతనవయస్కులగు స్త్రీపురుషు
లితర పతి సతుల వరించి చెడుటకు గారణం బయ్యె, గావున, నీచెప్పిన
నాటకాభిప్రాయం బను దివ్యోదకంబున సకల ధర్మాలవాలంబును, సత్య
వాక్యం బనెడి మూలంబునకు కలిగి కీర్తిలత వృద్ధినొందు నందు బతిభక్తి
యనెడి పుష్పగుచ్ఛంబు భాసిల్లుచుండు దీనియర్థంబు దెలిసికొనిన మాన
వులు హరిశ్చంద్రునివలె సత్యవ్రత నిష్ఠులగుదురు. ఈనాటకంబును వేదు
కచే హరిశ్చంద్రునివలె సత్యవ్రతనిష్ఠు లగుదురు. ఈ నాటకంబును వేదు
కచే జూడగోరిన చేడియలు చంద్రమతివలె పతిభక్తి నిరతు లగుదురు.
అందువలన వారల కిహపరసాధకంబగును. కాబట్టి, ఇమ్మహనీయ నాట
కంబును, నవరసాలంకారంబును, నృత్తగీతవాద్యస్వర తాళమేళనంబుగా
నాడుటకు ముందు ఈసభామండలంబునం దుండెడి పండితజనపాద పుండ
రీకంబులకు దండప్రణామంబు లాచరించినిర్విఘ్నంబుకొరకై విఘ్నేశ్వరు
ని బ్రార్థింతము సఖీ॥

### విఘ్నేశ్వరుని ప్రార్థన.

దరువు-కల్యాణి-అట.

గంగాధరతనయా-గజానన-గంగాధరతనయా॥ తుంగభుజంగమ
పుంగవభూషణమంగళకర దేహా-గజానన॥ గంగా॥ మూషకవాహననా
రదశుక సనకాదిపసుత హే-గజానన॥గంగా॥ తాండవఖేలనపండితపాలన
ఖండితరిపువీరా-గజానన॥ గంగా॥ గుణగణపతి శ్రీకరసుగుణాకరసురముని
సన్నుత హే-గజానన॥గంగా॥ దురితదళనబెడుదూరుని కేతన-వరమునిపరి
పాల-గజానన॥గంగా॥

క థా ప్రా ర ం భ ము.





దేవేంద్రుడు.



దేవేంద్రుడు వచ్చుట

దరువు—ఆరభిరాగము—ఆది.

కొలువుకూటముజేరెను—సురలోకనాధుడు॥ కొలువు॥ ఇరుగడలను మునివరులునుతింపగ—సురకిన్నర ఖేచరగరుడులతో॥ కొలువు॥ సారవార వరనారీజనములు—కోరికతోడనుజేరి నటింపగ॥ కొలువు॥ వారక శ్రీబెడు దూరుశౌరిపద—వారిజములు వేసారకదలుచు॥కొలువు॥

దేవేంద్రునిమాటలు॥ మునివరులారా! మీరతులిత తపశ్చర్యా ధుర్యులు మీరెరుంగని సంగతు లీలోకంబునఁ గల్గునే. నేనిపు డొక ప్రశ్న గావించెద. వినుండు, ధరణిలో సత్యవ్రతాచరణుం డగు భూ రమణుం డెవ్వ డానతిండుస్వామీ॥

సూతునిమాటలు, సప్తఋషులారా! ఈపురందరు డొనర్చిన ప్రశ్నంబు విని, ఈకశ్యపముని కన్నులు మూసె, ఈయత్రిముని దాత్రి జూడఁ దొడంగె. ఈభారద్వాజుండు భయంబు నొందె. ఈగౌతముండు పాదాంగుష్ఠంబుచే నేలవ్రాయఁ దొడంగె. ఈజమదగ్ని జడభావంబు నొందె. త్రిలోకాధీశ్వరుం డగు ఇంద్రుపల్కులకు తగిన సదుత్తరంబివ్వ కున్న మీకపకీర్తి రాగలదయ్యా వసిష్ఠవిశ్వామిత్రులారా॥

వసిష్ఠు॥ మ॥గిరిభేదీ తెలియంగ జేతు నిపుడీగీర్వాణు లెల్లన్వినఁ! సరసీజాప్తకులోద్భవుండు సుగుణాంచత్కీర్తి సత్యవ్రతా।చరణుండాశ్రిత కల్పకుండగుహరిశ్చంద్రుండునాథుండునీ। ధరనాభూవరుబోలరొండొరులు సత్యౌదార్యశీలంబునఁ॥క॥ కలనైనబొంక నేరడు।తొలగడు పరిపంథి నెదిరి తోరపుకలిమి।న్బలియుండర్థిజనాళికినలయకనిష్టార్థమిచ్చునతడు సురేంద్రా మాటలు॥జంభాంతకా! కుంభినీతలంబున నేజూడనిరాజులు లేరు. అంభో రుహమిత్రకులసంభవుండగు హరిశ్చంద్రమహారాజుసాంద్రతరసత్యసంపద నెన్నుటకు పన్నగపతి కయిన శక్యమా! భూతలంబున సత్యవ్రతంబుచే ప్రస్తుతి కెక్కినవా డతఁడొక్కఁడితరుల జెప్పనేలనయ్యా॥

వసిష్ఠ విశ్వామిత్రుల సంవాదము—మత్తకోకిలలు.

విశ్వామిత్రుడు॥ఏలయీబలుమాటలాడగ నింద్రుసన్నిధిబోలునే। శీలియుండగు వానినెన్నినపాపమును రాకుండునే ॥ఏల॥

వసిష్ఠుడు॥ చాలనీకిటుకోపమేలర చాలుచాలురకౌశికా। పాలితా మరపాళికొల్వున బాడిదప్పగ బల్కకుమీ॥చాల॥





శిష్యుడు. వసిష్ఠుడు. విశ్వామిత్రుడు.

విశ్వా॥ మానుగా మునికోటిగానని మానవేశ్వరుగంటివే। వాని నిల్కడవానిసత్యమువాని యోగ్యతగాననె॥ ఏల॥

వసి॥ భానువంశ్యులసూనమాన్యతబాఫులాట యెరుంగవే। మానివై యీపాపహేతువుమాటలాడగజెల్లునే చాల॥

విశ్వా॥ వాసిమీరబురోహితంబినవంశజాచుని యింటిలో। కాసుకొరకై చేసినందుకు ఖండితంబుగ జెప్పెదో॥ఏల॥

వసి॥ దోసమేలర నీకు శ్రీబెడుదూరుదామునిప్రేమతో। భాసురుండుత్రిశంకసూతుడుబాసదప్పడులేశము౯।చాల॥—మాటలు॥కౌశికా! వినుము. సూర్యకులోద్భవు లగు రాజులకు పురోహితంబు జేసినందుకు బొగడితి నంటివా! ఆదికాలంబున నీయింట బురోహీతంబు జేసియుంటి గదా! నీవెన్ని కాసులిచ్చియుంటివిరాతుంటా। కన్నుమిచ్చు గానక వేల్పు మన్నెవానికొల్వులో తెలివిమాలిన పలుకులు బలుకకురా తులువా♦

విశ్వామిత్రునిమాటలు॥వసిష్ఠా! విను. మీమునివరు లందరుండ నీవేమోాగరిష్ఠునివలె నికృష్టోక్తులుపలికెదవు. రాజకులంబునబుట్టినవారు సత్యాత్ములనిన, నేనమ్మజాలను. ఇమ్మునివరులందరు నీమాటవిన్నవారింక బలవంతంబుగా నేల గొంతుజించుకొనియెను. ఈదొప్పటచే దప్పిగల్గును చాలింపుమా॥

వసిష్ఠునిమాటలు॥ విశ్వామిత్రా! నీవంటి శకుర్తవర లెవ రెన్ని మాటలాడినను. నాహారిశ్చంద్రుసత్యంబు దప్పింపజాలరు. బ్రహ్మరుద్రాదులకయిన నారాజుగుణాతిశయంబు గణింప శక్యంబు గాదు. గావున నింక నోరుమూసికొనుమా దురాత్మా॥

విశ్వామిత్రునిమాటలు॥ వసిష్ఠా! విను. హరిశ్చంద్రుండు సత్యాత్ముండని సందరిలో నిశ్చయంబుగ బలికెద,వు నేవానిపై చలపట్టిపదభ్రష్టునిగావించి, నిష్ఠురాటవుల గష్టపడునటుల జేసి, ఆలుబిడ్డల నెడబాపి మాలలుపాలు గావించి, శీలత్వ మెడలించి, సత్యంబుపై బాళి దప్పించి బొంకించిననీ వేమయ్యెదవురా॥

వసిష్ఠునిమాటలు॥ విశ్వామిత్రా! విను. మేరుమందరంబులుతలక్రిందైన, నగ్నిభట్టారకుండు చల్లనైనా, సూర్యచంద్రులు నేలవ్రాలిన, సముద్రంబు లింకిపోయిన, లోకంబులుచీకాకుబడినా, కులసతిన్ బాసినా, కులహానియైనా, పుత్రమిత్రాదుల నెడబాసినా పలికి బొంకనేరడు. నీ వెన్ని బాధలబెట్టినా నారాజు సత్యవ్రతంబు నిత్యంబుగాబాలించునుగాని, యించుకైనన్ బొంకనేరడురా॥

విశ్వామిత్రునిమాటలు॥ వసిష్ఠా! ఈవట్టిమాటలాడిన ఫలంబేమి? నేనాహరిశ్చంద్రుని బెట్టరాని యిడుమలన్ బెట్టి సత్యహీనుని గావించిన పందెమేమిరా బ్రహ్మపుత్రా॥

వసిష్ఠునిమాటలు॥ విశ్వామిత్రా! విను హరిశ్చంద్రమహారాజు బాల్యము మొదలు మనోవాక్కాయకర్మంబు లేకలోపంబుగావించిసత్యవ్రతంబు సలుపునుగాని, కలనయిన బొంకనేరడు. నీవింక నాతనిమతి గలంచి ధైర్యేతరుని గావించి బొంకించితివేని. నేబలికెడి ప్రతిజ్ఞవినుము. శిఖా యజ్ఞోపవీతంబులు విసర్జించి పోడిమిగా గాడిదెపైనెక్కి హీనమానవుని తలపుఱ్ఱెలో మధ్యమాంసంబులు మెక్కుచుకులభ్రష్టుడనై దక్షిణాభిముఖుడనై పోయెదరా గాంధిపుత్రా॥

విశ్వామిత్రునిమాటలు॥ వసిష్ఠా! వినుము. హరిశ్చంద్రుని బుద్ధి గలంచి అబద్ధమాడింపలేనైతినేని మత్ప్రతిజ్ఞనువినుము. పంచాగ్నిమధ్యంబున నిల్చి బ్రహ్మరుద్రాదులన్ గూర్చి నేనొనర్చినఘోరతపంబులోసగ భాగం బతనికిచ్చి ఈభూలోకంబునంతయు పూజ్యంబుగ రాజ్యమేలించి పిమ్మట దేవేంద్రు నర్థసింహాసనంబున పదునాల్గుమన్వంతరంబులవరకు నిలిపెద, నీవుపోయి యారాజునకబద్ధమాడవద్దని చెప్పుము పోరా॥

వసిష్ఠునిమాటలు॥ విశ్వామిత్రా! యామానవేశ్వరునకు నేబోయి చెప్పవలెనా॥యాతని మేనితోడనే సత్యాదిగుణంబులు పుట్టియున్నవి. యొకడుచెప్పపనిలేదురా కట్టడీ॥

దేవేంద్రునిమాటలు॥ ఓవసిష్ఠ విశ్వామిత్రులారా! మీవాక్కలహంబుచే భూతాక్రోశంబుపుట్టెనిఖిలజగత్ప్రళయము। కారణోత్పాతంబులకు గనుపట్టఁ దొడంగె. గొలువునఁగల బృందారకులందఱు దిగులొందిరి. గాన, నావందనంబుగైకొని మీవాక్కలహంబుమాని మీనివాసంబులకు బోయిరండు మహాత్ములారా॥

అట్లనే బోయివచ్చెదమయ్యా॥

దరువు-నాట-ఆది.

చోపుదారివచ్చె సభకుసొంపుమీరగా-చూపుల కింపుగ జనులు చూడవీధివీధులనిలిచి॥ చోపు॥ హెచ్చుగా పురజనులకెల్ల హెచ్చరికెలు జెప్పుకొనుచు॥ చోపు॥ రాజేంద్రుండుసభకు నేడురాజసముగావచ్చెననుచు॥ చోపు॥ లలితమా బెడుదూరీశుదలచుడని దండింపుచు॥ చోపు॥

మాటలు॥ హిత పురోహిత మంత్రిజన కవి భట నట గాయక వందిమాగధవాంశిక వైతాళికాది సకల విద్వజ్జనంబులారా! నేడు మన రాజు నిజ తేజోవిరాజమాన వైభవంబుతో గొలువుకూటంబునకు వచ్చుచున్నాడు. గావున, మనవీటిలోగల నాటకశాల లాటకూటంబులు హజారంబులు బజారు లాదిగాగల ప్రదేశంబుల గంధకస్తూరికాది పరిమళోదకంబులు జల్లించి ముత్యాలముగ్గు లేర్పడఁ బెట్టించి మంగళకరంబుగా రంగవల్లికలు దీర్పించి మణిమయాతపత్రధ్వజపతాకంబులెత్తించి మకరతోరణంబులఁగట్టించి యెల్లెడల చల్లదనంబు లుల్లసిల్లునటుల వట్టివేళ్ళ పందిళ్లుబెట్టించి యలంకారంబు చేయవలయునయ్యా పురజనులారా॥



మంత్రి.



హరిశ్చంద్రమహారాజు.

పురజనులమాటలు॥ మంచిదయ్యా చోబ్దారి॥

చోపుదారిమాటలు॥ ఒరేభటులారా! రాజువరకు మీరందరు అదబ్బ జాయించుకొని యుండుడు ఖబర్దార్॥

హరిశ్చంద్రుని వేషము కథ—ద్విపద—శ్రీరాగము.

శ్రీ హరిశ్చంద్రుడా శ్రితరక్షకుండు-సాహసద్గుణశాలి శ్రీకరుడు-పోలచతుర్విధపుణ్యుడై ధరణి-బాలించుచుండి యేర్పడనొక్కనాడు-మునులమతంబున ముదముదలిర్ప-ఘనతరసవసంబుగావింపదలంచి-మధుమాసమునని జమహిమదీపింప-బుధజనుల్నుతియింపభూరి తేజనమున కొలువుండగా నెంచికువలయేశ్వరుడు-సలలిత సంపూర్ణ చంద్రునిభాతిశిరత్నకుండలహారరమణీయకటక-నూత్నభూషణ వజ్రనూపురపతక-వరమణిభూషణావళులుశోభిల్ల-బిరుదు లెత్తుచు పందిబృందంబువొగడ-ప్రణవభూరీభేరి భాంకృతుల్ జెలగ - గణికాసమూహంబుగానంబుచేయ - గదలె శ్రీబెడుదూరుగరుడవాహనుని-మదిలోనదలచి యమ్మనుజవల్లభుడు॥

దరువు-శ్రీరాగము-రూపకము.

సభజేరెనాహరిశ్చంద్రభూవిభుడు - ఉభయపార్శ్వంబులనునిభచయంబులునడువ - సభయులగువారలకునభయదానంబివ్వక॥ సభ॥ భటనటులునిట్టలతటఘటితకరవుటులునై - చటులముగడనదుముందటబొగడగాను॥సభ॥లలితమాబెడుదూరు నిలయుపదములుమదిని - దలచుచును సంతసము కొలదిమీరగును॥ సభ॥

మంత్రికైవారము-మాటలు॥ హరిదంత దంతావళ దంతకాంతి ప్రద్యోతమానకీర్తి! దుష్టజననిగ్రహోదగ్రనమవర్తి! శిష్టజనదయానువర్తి! హరిశ్చంద్రమహారాజచక్రవర్తి! విజయీభవ రాజేంద్రా॥

రాజుమాటను॥ మంత్రీ! నేను విచారించదగిన రాజ్య కార్యంబులెవ్వియైనన్ గలవేమయ్యా సత్యకీర్తి॥

మంత్రిమాటలు॥రాజేంద్రా! నేడువిచారించదగిన రాజ్యకార్యంబులేమియు నగుపడలేదు మహాత్మా॥

రాజుమాటలు॥ మంత్రీ! మదీయ భుజాదండమండిత పరాక్రమంబుచే బెండుబడిన భూమండలాధీశ్వరులవల్ల-బంపబడిన వార్తాపత్రికలేమైన వచ్చియున్న వేమయ్యా మంత్రివర్యా॥

మంత్రిమాటలు॥ వచ్చియున్నవి చూడండిస్వామీ॥

రాజుమాటలు॥ మంత్రీ! వీరు బంపిన కప్పంబులను లెక్కప్రకారంబుగ ఖజానాకు జేర్చి భటవర్గంబునకు నిలుకడ లేకుండ జీతంబులు బట్వాడా జేసియున్నావేమయ్యా॥

మంత్రిమాటలు॥ మామూలుప్రకారం బందరకు బాకీలేకుండా జేసియున్నాను స్వామీ॥

రాజుమాటలు॥ మంత్రీ! బీదలకుగాను మన మొనర్చిన సత్రంబులకు పైకము బంపియున్నావా॥

మంత్రిమాటలు॥ లెక్కప్రకారంబుగ బంపియున్నాను స్వామీ॥

రాజుమాటలు॥ మంత్రీ! మగధమాళవ నేపాళ మళయాళ కాశ్మీర సౌవీరాది వివిధ దేశాధీశ్వరులగు రాజవరులకు సత్యధర్మంబులదప్పక దేవ విప్రాగ్రహారంబుల బన్నుదియ్యక ప్రజలకాపదలుగల్గకుండునటులవర్తింపుడని ప్రత్యుత్తరంబులవ్రాసి మదీయముద్ర వేసి పంపుమా సత్యకీర్తి॥

మంత్రిమాటలు॥ మంచి దట్లనే పంపెదను స్వామీ॥

రాజుదరువు—రూపకము—బిలహరి.

చైత్రమాసముసత్రయాగము—సలుపగవలె॥ చైత్ర॥ పాత్రయాగ సూత్రవిదులౌ— ధాత్రీసురపుత్రులబిలు॥ చై ॥ నేడెవ్రాయుపత్రికలనునిఖిల రాజులెల్లసుఖము—జాడలన్నియుజూడమిత్రులతోడ వేడుకరా॥ చైత్రోలుత గుడునిబిలువబంచి యజ్ఞఘుయాగ భారములను—తెలియపడిగి వారిసెలవు గొలదివస్తువులుగూర్పుము॥ చైత్ర॥ సరయువునకునుత్తర దిశగురుశిల్పకోవిదులతో—పరశాలయునిర్మింపుసుర ఖేచరులు జూచియుదుండగ॥ చై॥ యనవరతము బెడుదూరిహరిచింతనమరువక ఈపనులు జేయుగా—ఒసుముధనము గొనుఘనముగయిా॥ చైత్ర॥—తే॥గీ॥ మంత్రిశేఖర యీచైత్రమాసమందు। సర్వతోముఖమనుపేర జన్నమిపుడు। నేనొనర్చెదగావుచ మౌని జనుల। బిలువనంపుము వేగంబ జెలువుమిగుల॥—మాటలు॥ మంత్రీ! చూచితె, ధాత్రిలో చైత్రమాసం బెంతచిత్రంబయ్యె, కిసలయ పుంజమంజరీ భాసురంబులైన సకల వృక్ష నికరంబుల తుదలంజేరి కోడెకోయిలలు కూయుచున్నవి, చెలువుగులికెడిచిలుకలకలకలధ్వానంబులువిననింపయ్యె, అంగజాళి సంఘుంబుల కిర వగు శృంగారభవనాంగణంబు లవజలంగుల తాకు దుంగంబుల ముంగిట రంగద్భృంగ సంగీతరవంబు విన వేడుకగుచున్నది. సకలజనమనోభీష్టదంబైన ఈ చైత్రమాసంబున యజ్ఞంబు జేసిన

యోగ్యంబై యుండు గావున, వసిష్ఠాదిసన్మునుల రప్పింపుము. కావలసిన యాగసంభారంబుల దెప్పింపుము, సరయూనదీతీరంబునను దగ్గ్యాగయో గ్యభూమియందనల్పశిల్పకోవిదులలో యజ్ఞశాలనిర్మింపుమా మంత్రిశేఖర॥

మంత్రిమాటలు॥ రాజేంద్రా । మీరానతిచ్చినప్రకారంబుగా నిప్పనులు తప్పక జేసెదను స్వామీ॥

విశ్వామిత్రుని వేషము కథదరువు - దర్బారురాగము - అట,

గాధిసూనుండెంతకఠినుడో రాజునూ-బాధ జేసెనని ప్రజలుననుదిట్టరె॥ గాధి॥ తపసకులోద్భవుడు దయలేక క్రూరుడై - విపులవైభవములనపహరించెనని॥ గాధి॥ సురుచిర బెడుదూరుపుర వాసుడగు శౌరి - కరుణింపడేమొ యీ ధరణీనాథుని నేడు - గాధి॥—— మాటలు॥ ఆహా! కోపంబునకు సమానంబైన పాపం బెందైనగలదే దైవమా! ఇంద్రసభామధ్యంబున తపోగరిష్ఠుడగు వసిష్ఠుండు హరిశ్చంద్రుని సత్యంబు బొగడిన నేసహింపక క్రోధావేశంబున నతని బొంకింతునని నిష్ఠురప్రతిజ్ఞ జేసితినే! ఇంక నాశపథంబు నెరవేర్చుటకు నిష్కారణంబుగ కపటక్రియలుబన్ని పరిపూర్ణ దయాదాక్షిణ్యాది గుణసంపన్నుండై జగతీతలంబు బాలించెడిసత్యవ్రతుండగు హరిశ్చంద్రుని బాధింపవలసెనే శ్రీహరీ! శ్రీహరీ! కాని, ఈకారణంబున యీమహారాజు సత్యసంపద నిఖిలలోకంబుల నిండించెదనొండె, గాక, యతని బొంకించెద నొండె. ఈరెంటిలో నొకటిగావింపవలసిన విధియయ్యె. నాకారణంబున నతనికి కష్టపాటులుగల్గుటయు, లోకులచే నాకు తిట్టులాటులుగల్గుటయు, మాయిరువురకు పూర్వకృతకర్మ లబ్ధంబయ్యె. నింక చింతింపనేలనయిన నాయోగదృష్టిచే హరిశ్చంద్రుండు నతని యిల్లాలును తొలిజన్మంబున నెవ్వరై జనించి యేయేసుకృతదుష్కృతంబు లాచరించిరో చూచెద॥

చంద్రమతి హరిశ్చంద్రుల పూర్వజన్మ వృత్తాంతము.

సీసమాలిక॥ ఈహరిశ్చంద్ర మహీపతి తొల్లింటిపుట్టున భూమిలో బొందుగాను । నీలలోహితమహీపాలుడై జనియించె చంద్రమతియుదొలి జన్మమిందు । నాపురిలోపంట కాపకులంబున గలకంధరనబుట్టిఘనముగాను । భద్రుకోడలై పతియనుమతిమీరి రాటాలసాలెలో రమ్యముగను । పడతియోకులుబట్టియొడుకుచుండగ రాజుదుష్టుడెగనమైనతురగమెక్కి । పురవీధి వచ్చుచుబాలతినివీక్షించి మదనఘూర్ణబిన్నహృదయుడయ్యె । నాపంటవాల్గంటిభూపాలుజూచెనయ్యెరుపురకున్నబ్రేమమినుమడింప । రాజవర్యుడు

దానిరమణునిజెరబొట్టి తక్కినవాపుజిక్కబట్టి। చండాలసేవ జేయుండని
నియమించి సర్వధనంబులసంగ్రహింప। బ్రదుకాడిగ దానిబంధులగ్నులలో
నబడజూచియబ్భూమిపాలుడంత। కలకంధరిని భార్యగావించుకొనిరతి కేళి
దేలగశరత్కాలమైనకామిని కేదారగౌరీవ్రతమును వరుసనిర్వదియొక్క
వత్సరములు।సల్పియుద్యాపనసంపూర్తిగావించిపతి నెడబాసినపాపమెల్ల।
బాసియారాజు నెబతియుగాభావించి చిరతర సౌఖ్యంబు జెందుచుండ।నం
తట నేనునయ్యవనీశుకడ కేగిసర్వజిదాఖ్యరాక్షసుడునీకు మిత్రుడు దేవతా
మిత్రుడౌనాతనిజంపిన-పరదారసంగ్రహంబు జేసినపాపంబు జెడిపోవునంత
నాతపములోసగమిచ్చి ధరణి నెల్ల।ముందుజన్మంబునసంతోషముతో నేలింతు
వనరాక్షసునిజంపియువనినేని। వారిద్దరొకటశరీరముల్వీడువనందతడు హరి
శ్చంద్రుడై జనించె॥ నాకానవెలతయు శ్రీకారవంతిపురాధీశ్వరుని గూతు
రై జనించె।దుష్టలగ్నంబునందు నాదుహితవతడు। బెట్టిలోబెట్టియేటిలోవ్రే
యబనుప। మయుడుపాలించి యాచంద్రమతిని నిజనికిచ్చి పెండ్లినిగావించె
హితముమీర॥——మాటలు॥ కావున, వీరుతొలిజన్మమున జేసినకర్మఫలంబీ
జన్మంబుననుభవింపగలవారు. నాతపమ్మాదింకొకచిత్రంబుగంటె, ఈహరి
శ్చంద్రుండు తొలిజన్మంబుననీలలోహితుండై యుండిపంట కాపకులంగున
నెత్తికొనివచ్చినపాపంబుబోగొట్టుటకు నేనితనికి జేరి దేవకంటకుడైనసర్వ
జిదుడనురాక్షసుండు నీకుమిత్రుండు,వీవాడనుజువధించినజగదుపకారి వౌ
దువందువలనపరదారగమనపాపంబునశించు. ముందుజన్మంబున నాతపం
బున సగభాగంబుబంచి నీకిచ్చి పూజ్య బుగభూలోకంబున రాజ్యమేలించి
పిమ్మటనింద్రార్ధసింహాసనంబుననునించెదననిమాటయిచ్చియారాక్షసునిజ
పించితినానీతిలోహితుండై ఈహరిశ్చంద్రుడయ్యెనితనిబరీక్ష చేసి చూచెద.

దరువు-కమాల్ రాగము-రూపకతాళము.

ఏరీతిమాయబన్నుదు-భూరమణుని-బొంకించుట॥ కేరీతి॥ మేరలేని
ధనముగోరి నేరమెంచుచుగ్రూరమతినై -భూరిరాజ్యముగుంజుకొని——ఘో
రకానకుసుబంపుట॥ కేరీతి॥వాసవునికడనుబల్కి సవాదులన్నియు జెప్పియుం
డునో-దోసకారియావసిష్ఠుడు మోసమానొహోమ్ముం దేగతి॥ ఏరీతి॥ హెచ్చు
గానేధనముగోరిననిచ్చునో నతడివ్వకుండునో-అచ్చుగా బెడుదూరు నేలిన
అంబుజాక్ష శ్రీహరిహరియిక॥ ఏరీతి॥

సీ॥బ్రహ్మపుత్రునిబెక్కబాధలసయించిపుత్రశోకాబ్ధింముంచినాడ।
దివిజలోకముంకు దేహంబుతోడ నేబరగత్రిశంకుని బంపినాడగురుతరంబగు

విఘ్నకోటికినోర్చియుబ్రహ్మర్షి పదమేనుపడసినాడ। ధాతకుబదులుగాభూత
జాలంబుల నంచితగతినిబుట్టించినాడ। అంబరీషునిజుశ్వమేధంబు ఫలము।
స్థిరముగానిచ్చి యాశునశ్శేపునకును । చిరతరాయువునొసగితిధరణిలోన।
ఈహరిశ్చంద్రు బొంకించు టెంతఘనము॥

మాటలు॥ ఆహా! నేజేయుపనుల కడ్డపడి తప్పించువా రెవ్వరు గలరు. భళీ! లోకంబుల నాకసాధ్యం బున్నదే. నాచండకోపంబున కా ఖండలాదులు బెండుపడుదురు. నిజమాయాప్రభావంబుచే త్రిజగంబుల గజిబిజిజేయంజాలుదు, నేనింత విచారపడనేల? ఐనా వసిష్ఠమహాముని శిక్షితుండై హరిశ్చంద్రుం డేకయజ్ఞంబుచేయుచున్నవాడు. నాతని జేరన్జని మేరలేనిధనంబడిగి మాటదీసుకొనిపిమ్మట లేని పోనివాదుబెట్టుకొనిరాజ్యం బపహరించుచు పెక్కిడుముల చిక్కులుబెట్టి ధన మివ్వ మని దంధణజేసి సాధ్యమగునంతవరకు దయాదాక్షిణ్యంబులుదలంపక మాయోపాయంబులచే బొంకించెద. ఒరేద్వారపాలకా! నారాకమీరాజున కెరుంగింపరా॥

రాజుమాటలు॥పదివేలువందనంబులుస్వామీవిశ్వామిత్రమునీంద్ర॥

విశ్వామిత్రుమాటలు॥ దీర్ఘాయుష్మంతుండవై వర్ధిల్లుమారాజేంద్ర॥

రాజుమాటలు॥ గీ॥ దేవనీవుబ్రహ్మదేవునిసమముగ । సృష్టికలుగ జేసితుష్టిబొంది । సర్వమునులలోనసార్వభౌముడవగుట॥ నీదుదర్శనమున నగడెగులము॥— మాటలు॥ విశ్వామిత్రమునీంద్రా! స్థావరజంగమాది భూతంబులతో భువనంబులబుట్టించిన పరమేష్టికిసమానుండవై బ్రహ్మర్షి పదవిగనిన మీపాదధూళి స్పర్శనంబుచే నాకఖిలమోదంబులు గలిగె, మీరిచ్చటికి వచ్చుటజేసి నాభాగ్యంబు యోగ్యంబయ్యె. నాజన్మంబు ఫలించె నాకులంబు పావనంబయ్యె॥ మిమ్ముగొనియాడ నేనెంతటివాడ. మహాత్ములగువారూరకేరారు మీరేపని నిమిత్త మిచ్చటికి విచ్చేసితిరో సెలవిచ్చిన సేయగలను మహాత్మా॥

విశ్వా॥క॥ జననాయకనేనిప్పుడు । ఘనసవనంబొకటి సేయగాధన మునకై ।పనివూనినిన్ను వేడగ।జనుదెంచితినయ్య రాజసత్తమ వేడ్కన్॥— మాటలు॥రాజేంద్రా! నేనొకయజ్ఞంబు సేయన్దలంచి ధనార్థినై నిన్ను యాచింపవచ్చితి, నేనడిగినంత ధనంబిచ్చి కీర్తివహింపుము రాజేంద్రా॥

రాజుమాటలు॥ మునీంద్రా! నీయజ్ఞంబున కెంతధనంబు గావలసి వచ్చునో సెలవిచ్చిన దెప్పించి మీకొప్పించెదను స్వామీ॥

విశ్వామిత్రునిదరువు - తోడిరాగము - రూపకతాళము.

ధనమొసంగుధరణిపాలకా-నేనడిగినంత॥ ధన॥ ఇనకులంబునఘన తరంబుగ జనన మొందినవాడవిగ-మనుజనాయకమాటదప్పకవినుము నా మఖమునకుదగిన॥ ధన॥ మాటలేల మాయనువ్వుందుముదగజంబు నెక్కి-నిక్కి-గోటిచేత రత్నమొగర మీటిన త పాడవుగల్గు॥ ధన॥ పుడమిబెడుసు రీతు దయనుమీడివిదప్పదెన్నడైన-దడవులేకధనమొసంగు మడరుకీర్తులవనిగల్గు ధన॥—మాటలు॥ రాజేంద్రా! యొకమానవుండేనుగు నెక్కి-నిక్కి-గోటిచే రత్నమొగరమీటిన నెంతపొడ వగునో, అంతపొడవు ధనంబు రాసిబోసి మాకొప్పగింపుమా భూపాలకా॥

రాజుమాటలు॥ విశ్వామిత్రమునీంద్రా! దానపాత్రులగు మీకు ధన మిచ్చుట చిత్ర మగునే మీకోరినంత ధనము దెప్పించి యిప్పించెద గైకొనుము మహాత్మా॥

విశ్వామిత్రునిమాటలు॥ హరిశ్చంద్రమహారాజా! నీమనసు జూడ వలెనని యడిగితిగాని, మాకిప్పుడేల? వలదయ్యా నేజేయు యజ్ఞంబునకు ముహూర్తంబు నిశ్చయించుకొనివచ్చి పుచ్చుకొనిపోయెదగాని, యంత వరకు నీవద్ద నుండనిమ్ము. మాకిచ్చిన మాటమాత్రము మరువకయుండు మేమాశ్రమంబునకు బోయివచ్చెదము రాజేంద్రా॥

రాజుమాటలు॥ పదివేలువందనంబులు పోయిరండు మునీంద్రా! మంత్రీ! చూచితే, ఈమునివరుండు నాపైనప్పుబెట్టిపోయె నెట్టిసమయం బున వచ్చి యడుగునో గదా సత్యకీర్తి॥

మంత్రిమాటలు॥ఆహారాజేంద్రా! మీకొకసమయంబుగలదా ఏల చింతించెదరు. యెప్పు డడిగిన నప్పుడే యొసంగవచ్చును లెండిస్వామీ॥

విశ్వామిత్రుని॥క॥ అవనింక బలుమృగంబుల । మానుగబుట్టింప వానిమదమణగింపఁ । కానవభూమికిభోరన । భానుకులోద్భవుడు వేటపని గావచ్చుఁ— మాటలు॥ ఆహా! నేనింక నపూర్వ ఖగమృగంబుల బుట్టించితినేని, ఈజగతిజను లందరు దిగులొంది హరిశ్చంద్రుల కెరుంగింతురు. అతం డంతట సాహసంబున వేటనిమిత్తంబు గాంతారభూములకు రాగలండు. తర్వాత నొకపని జింతింపవచ్చు.

దరువు - ఆనందభైరవి - ఆదితాళము.

పౌరులందరురాజుజేరగా - పాలుపొందగవచ్చిరి॥ పౌరు॥ పైరులు పంటలపారమృగంబులు - చేరివినాశముసేయగభీతిని॥ పౌరు॥ దెంతంబున

దిగులొందుచు నెంతయు-సందడిమీరగ చయ్యన నటకును॥ పౌరు॥ కోరికతో బెడుదూరుపురంబును-సారెకు బ్రోచెడి శౌరిను తింపుచు॥ పౌరు॥ మాటలు॥ సప్తవారధిపరివేష్టితాఖండ భూమండలాధీశ్వరా! కోటీరసంఘటితజంబాసురాంతక మణికుంభత్పాదయుగళా! హరిశ్చంద్రభూపాలా! పదివేలు వందనంబులు స్వామీ॥

రాజుమాటలు॥ దీర్ఘాయురారోగ్యపుత్ర పౌత్రాభివృద్ధికలిగివర్ధిల్లుడు పురజనులారా! మీరాకడ జూడగా, బహుభయభ్రాంతిగలవారై వచ్చియున్నట్టు తోచుచున్నది. నెరుపకుడిదె మీకభయమిచ్చెద నదియేమో వినుపింపరయ్యా॥

పౌరజనులమాటలు॥ ఓహరిశ్చంద్రమహారాజా! నీవు నిత్య సత్య దయా దాక్షిణ్య నైపుణ్యుండవతివదాన్యుండవు, భువనమాన్యుండవు. ధైర్య సుపర్వపర్వతుండవై యుర్వీభరంబు నిర్వహించుచుండ మాకేమి భయంబుగల్గునైన నొక్కభయంబు మాకాపాదించి వచ్చితిమి యదెట్లన్న నెరుగించెదము స్వామీ॥

దరువు - నవరోజురాగము - ఆదితాళము.

నరవరమేమిదివరకు నెన్నటికిని-పరమాద్భుత మృగబాధలెరుంగము ॥నర॥ గురుసింహంబులు ఘోరగర్జనతో - జెరుకుతోటలు నెల్ల బెరికివేటాడెదను॥నర॥భీకరముగబల్స్కరమృగములుయాకుతోటలు చీకాకుగావించెను॥ నర॥ మానుగబెడుదూరుశ్రీనివాసుతోడ - భానుకులేశమా భయము వారింపవే॥నర॥—మాటలు॥ రాజేంద్రా! సింహవ్యాఘ్రవరాహమత్తేభాదిదుష్టమృగంబులచే మాపైరులు నష్టంబులైన తదుపద్రవంబు దీర్పుటకై నినుప్రార్థింప వచ్చితిమి స్వామీ॥

రాజుమాటలు॥ పురజనులారా! నేటిదినంబున నేవేటవచ్చి మేటిమృగంబుల గీటడంచెదగాని, మీరుభయంబుడిగి మీగృహంబుల సుఖంబుండుడీ పురజనులారా॥ గీ॥ మంత్రిశేఖర వినునేడు మనము వేట। కరిగి దుష్టమృగంబులదరమిజనుల। భయము వెసదీర్చివత్తిమీవార్తనిపుడ।పట్టణంబున జాటింప బంపుమీవు॥

మంత్రిమాటలు॥ మీయాజ్ఞానుసారంబుగ నట్లనే చేసెదనయ్యా॥

చంద్రమతివేషముకథ—ద్విపద - శుద్ధకాంభోజి.

శ్రీకరముఖకాంతిజితచంద్రబింబ- ప్రాకటాధరనిబాప్రయసితబింప సాంద్రగుణోజ్వలసన్నుతశీల- చంద్రమతియుహరిశ్చంద్రుని దేవి-కాంతుడు

వేటకై కదలెడివార్త-మంతసంబున విని మసవయ వ్వేళ - పదకంజమంజీర భాసురధ్వనులు-రొడకాయగ మెలసరోరుహనేత్ర- కొడుకుముంగలముద్దు గులుకుచునడువ- పుడమిశ్రీ బెడుదూరు పురవాసుదల ది॥

దరువు-తోడి రాగము-ఆది.

చూపరే-ఓసుదతులార విభుచూపరే॥ చూపరమ్మ సుగుదాపుని సముడను-భూపాళమాళికలాపుని మీరింక ॥ చూప॥ భృత్యామాత్యభట బృందయుతుండగు సత్యాత్ముడౌ హరిశ్చంద్రమహారాజును॥ చూప॥ వారక బెడుదూరి వారిజనయనుని-కోరినుతించెడి భూరిదయాళుని॥ చూప॥ —ఉ॥ రాజితకీర్తిసాంద్రపరరాజకులేశయచంద్రవిస్ఫుర త్తేజదయాసముద్రఘన దివ్యపరాక్రమ కాలరుద్రవి। భ్రాజదహార్యధైర్యసురయూజసమున్నత భోగ చర్యస । త్వాజితపుణ్యమూర్తి పెనుపొందననుకాదయజూచు ముక్కెదన్ —మాటలు॥ పదివేలువందనంబులు ప్రాణేశ్వరా॥

రాజుమాటలు॥ దీర్ఘసుమంగలీభవ, హేసౌభాగ్యవతీ! నీవిచ్చటి కేలవచ్చితి పనియేమికల దీపసిబాలునింతదవ్వేల దెచ్చితి వేహంసగామినీ॥

చంద్రమతిమాటలు॥ రాజోత్తమా! నేటిదినంబున మీరువేటకై దారుణాటవులకు వెడలుసన్నాహంబు పాటింపగా విని నేనును మీవెంట నరుగదలంచి వచ్చితిని, నేవచ్చుట దప్పుగా దలంపకుము మహాత్మా॥

రాజుమాటలు॥ పాటలాధరీ! దారుణాటవు లెక్కడ, నీ వెక్కడ, నేవేటకొరకు కారడవుల కరుగుచున్నాడ. నావెంబడి నీవు రావల దుడుగుము పడతీ॥

చంద్రమతిమాటలు॥ రాజేంద్రా! మీరిట్లానతీయవచ్చునా! అనపాయినియగు నన్నెడబాయదగునా! ఇంతదురంతంబగు మీవియోగం బేనెట్లుసహింతు ప్రాణకాంతా! కావున. మీవెంట కంటకారణ్యంబులకు వచ్చునట్లానతిమ్ము మహాత్మా॥

రాజు-కందార్థము॥ వనితామణి వినుమిప్పుడు । వనులకు నావెంట నీవువచ్చుటదగునే! వనరుహలోచనయంజలి । ఘనమృగములజూచిభీతి। గనియెదవబలా । కాంచనభూషణమని బాలా । యినుమున్ శృంఖలక మునుపె వచ్చెద ననువున నడవిపనలతోడను। మనమున నను బెగ డొందిమృగగర్జనల నీవునువినియు భీతి। గనియెదవబలా॥ —మాటలు॥ కనకాంగీ! వినుము, వనంబున ఘనంబులగు మృగగర్జనలువిని భయపడియెదవు గావున గృహంబు నకుబోయి సుఖంబుండుము, నేనతిత్వరితంబుగ బోయివచ్చెద నేకోమలీ॥

చంద్రమతి-కందార్థము॥భూపాలకులశిఖామణి।యేప్రొద్దునునిన్ను బాసిమెలగనుమదిలో। కోపముసేయకమన్నీ। పాపనివిడనాడగునె। పాప విదూరా। నాపైదయజూపుముధీరా। మీపదంబులయానసే నీప్రాపునను జనుదెంతుమృగములు।రాపుజేసిన వెరువసకలుషనిపతావనరోపాసనకుము పాపవిదూర॥—మాటలు॥ప్రాణవల్లభావిను. !నిన్నుడబాసినిమిషమాత్రంబైననిలువగలనా! గావున, నెల్లభంగుల నన్నుదోడ్కొనిపొమ్మిస్వామీ॥

రాజుమాటలు॥చంద్రమతీ! ఇంతమాత్రమునకై ప్రార్థింపవలెనా. నీకభిమతంబు గల్గియున్న బోదామురమ్ము రమణీ! మంత్రిశేఖరా!అడవి మృగంబుల దుడుకుమాన్పవత్తము.గావున, తగుసాధనసహాయులై వేట కాండ్రు వెంటవచ్చునటుల జేయుమా సత్యకీర్తి॥

మంత్రిమాటలు॥ రాజేంద్రా! వేటకాండ్రందరు తగుసాధనంబులతో ముందుజనుచున్నారు మహాత్మా॥

రాజ-గీ॥ సత్యకీర్తివేటసన్నాహములతోడ। నడచికరిగి మనము గడియలోన। మృగసమూహములను దెగజూచివత్తము।రథము నడుప వయ్యరాజితముగ॥—మాటలు॥ మంత్రీ!మనరథంబు నిద్యూడవిమృగంబులపై బరపుము.గండభేరుండ గవయ ఖడ్గ శరభసింహశార్దూలాదిఖగ మృగంబుల మ్రందించెద మంత్రిశేఖరా॥

మంత్రిమాటలు॥ అట్లనే చేసెదనయ్యా॥

రాజుమాటలు। సత్యకీర్తి। ఈఖగమృగంబుల దెగజూచితిమిగదా, అల్లదె వసిష్టునాశ్రమంబు గనుపట్టుచున్నది, గాన, నమ్మునిగరిష్టునితో మాటలాడిపురంబునకుబోదము.అచ్చటికి మనరథంబు బోవనిమ్మా మంత్రిసత్తమా॥

మంత్రిమాటలు॥ అట్లనే చేసెదనయ్యా॥

రాజుమాటలు॥ పదివేలువందనంబులు మునీంద్రా॥

వసిష్టుమాటలు॥దీర్ఘాయుష్మంతుండవై వర్ధిల్లుమా రాజేంద్రా॥ గీ॥ ఇనకులోత్తమ యింతదవ్వేలనిప్డు డరుదుదెంచితివీవునీయబలతోడ।నడవులందువసింపకుమయ్య యింక। గాధిసూనుడుమిమ్ముజాలబాధ జేయు॥—మాటలు॥రాజేంద్రా!-ఈయడవిలోనీవింకసంచరించినను,మాదుశ్చరితుండగు విశ్వామిత్రు నాశ్రమంబునకు కళత్రసమేతంబుగ బోకుమయ్యా, యాక్రూరకౌశికుండు బాధింపగోరుచున్నాడు, గాన, త్వరితంబుగ బురంబునకు వెళ్ళి సత్యంబుతప్పక రాజ్యంబుచేయుమా రాజేంద్రా।

రాజుమాటలు॥ స్వామీ! మీరానతిచ్చినటులనే బోయివచ్చెద సెలవిప్పించి యిదె పదివేలసాష్టాంగంబులు మునీంద్రా॥



వసిష్ఠమహర్షి.



కామధేనువు.



గోవు.

వసిష్ఠుమాటలు॥ కడుసురక్షితంబుగ బోయిరమ్ము రాజేంద్రా॥

విశ్వామిత్రముని-క॥ ఔరాయీరాజేంద్రుడు! నారీమణితనదుకూర్మి నందనుతోఁగూడ। ఘోరారణ్యంబునకుఁ ధీరతతోవచ్చె నేడు తేజమొలర్పన్

—మాటలు॥ ఆహా! నాభాగ్యమేమనవచ్చు. నేగోరినరీతిగా హరిశ్చంద్ర మహారాజు నారీరత్నంబుతో దారుణాటవిఁజేరఁ వచ్చె. నేవిధంబుననైన నాభూపతునిమదీయాశ్రమంబు జేరన్వచ్చునటుల ప్రేరేపించెద నెట్లనగా, రంగైన బంగారువన్నెలు గల యొకమాయకురంగంబు బుట్టించిపంపితి నేని, దానిపై మోహాతిశయంబుననావసంబునకు రాగలండు. తర్వాత, నొకవింతపని చింతించెద నని మాయాకురంగంబు బుట్టించుట.

రాజుమాటలు॥ సత్యకీర్తి! చూచితే బంగారువన్నెలపై వజ్రవైడూర్య గోమేధికపుష్యరాగాదిరత్నముల పొడలుగల యొడలితోవచ్చెడి మృగంబును నేయడవిలోనైనఁ గన్నవారమా, ఈమృగంబును బట్టి యిచ్చిన నాముద్దులకొమరుం డాడుకొనగలండు. గావున, మనరథంబు నిమ్మృగంబుపై దోలుమా సత్యకీర్తి॥

మంత్రిమాటలు॥ మంచి దట్లనే దోలెదనయ్యా॥

చంద్రమతి దరువు- ఆట ఆనందభైరవి.

మాయామృగముగాగబోలు-దీని-పాయక మీరింకపట్టగ వలదు॥ మాయా॥ మృగమాత్రముగాదుసీ మేను-లేదుజగతీశ దీనికైజాలినొందకుమం॥

మాయా॥ధాత్రీనాయకవిశ్వామిత్రుడు—యిట్టిచిత్రమృగముసృష్టిజేసియున్నాడు॥మాయా॥—తమకీసంశయమేలదెలియదెఈధరణి శ్రీబెడుదూరు ధవునిసాక్షిగను॥ మాయా॥—మాటలు॥ ప్రాణనాయకా! వినుడు. మృగమాత్రమైన కిట్టివన్నె చిన్నెలు గల్గునే. దీనిజూడ మాయాకురంగంబుగానున్నది. దీనికై మీరాశపడి పట్టనాహింపవలదు స్వామీ॥

రాజుమాటలు॥ జలజా! యిట్టిమాయలైన నన్నేమిసేయగజాలును. ఈలీలాకురంగంబుచే మనబాలుండు ముచ్చటలాడుకొనుచుండునే తలోదరీ॥

చంద్రమతిమాటలు॥అయితే మీయిష్టంబు లెండిస్వామీ॥

రాజుమాటలు॥ మంత్రీ! ఈమృగం బెచటనో డాగె. దానిపై మనకు మోహావేశంబేల? నాకు దప్పి జనింపుచున్నది. గాన, ఈరమణీయాశ్రమంబుజొచ్చినిర్మలోదకంబుల దప్పి దీర్చికొని పురంబునకుజోదమయ్యా॥

మంత్రిమాటలు॥ మంచిదిస్వామీ॥

రాజుదరువు—బేగడరాగం—ఆదితాళం.

చెలియారాకనుగొంటివే—ఈవనభూమి॥చెలి॥జలజాక్షీచూడుకోకిలమొత్తములగూడి—కలకలస్వరములచెలువమించెనువో॥ చెలి॥ కుందరదన మాకందముపిరుదమా—కంజసుందరములొకుందకుట్మలముల॥ చెలి॥ మదవతివినవుసమ్మదమునగనవోయీ— కేదర్లైనపొదలతుమ్మెదలరొదలుమించే॥చెలి॥వారిజముఖిబెడుదూరుపురీశ్వర—కోరినుతించి వనిజేరిచూతమువో॥

చెలి —మాటలు॥చంద్రమతీ! ఈరమణీయాశ్రమంబు జూచితే. ఈ కొలను గంటివా. ఇట్టినిర్మలోదకంబెన్నడైన కన్నవారమా కన్నియా! ఈశీతలోదకంబు ద్రావిన నాకన్నులకు నిదురవచ్చుచున్నది.నీతోడ తలగడగా కొంచము విశ్రమించెదనే చంచలాక్షి॥

చంద్రమతిమాటలు॥ప్రాణేశ్వరా! ఈవనంబు పోలించిచూడ నామనంబునకు భయంబగుచున్నది. గాన, నిక్కడ తడవుండదగదయిన నేనిపుడే తాతలంబున నూర్చుండెద. నాతోడ తలగడగ గొంత విశ్రమింపుడు స్వామీ! హా నామిత్రమా! నాప్రాణకాంతు డిటుకలువరించుచున్నాడు. హా ప్రాణేశ్వరా! యేమి కలువరించెదరు॥—సీ॥ సర్వసర్వంసహాచక్రభారముదాల్పద్విజరాజబోలినభుజబలంబుక్రూరస్వభావవిస్ఫారదావనీపాలగర్వాపహప్రాభవంబుఖలశిక్షసాధురక్షయు నొనర్చ

జాలువిలసితసన్మార్గవితరంబు । సాగరసామాదయశ్లాఘ్యసత్యాధికసుగుణ మండితమహానుప్రతంబు । కలిగి వసుమతి నేలెడి ఘనుడవయ్యు । సకల రాజాధిరాజువై జడునిరీతి । నిదురబోవుచు మధ్యలోన బెదరిచెదరి । కలువ రించుటకిదియేమి కాలమహిమా॥

చంద్రమతి హరిశ్చంద్రుల సంవాదము.

దరువు – శుద్ధకాంభోజి – అట,

కలువరించెదు ప్రాణకాంత నీవిదియేమి – పలుమారునీకింతభయ మేలకలిగెనో, యులుకకూ తలకకూ బెళుకకూ పలుకనేలను ॥కలు॥

రాజు॥ యెటువంటికలగంటనేమొలనాగ నేనిపుడు–పటుతరకోపుడై బాప డొక్కడువచ్చి – కటకటా మకుటమూ తలుకునా దన్నియాడ్చెను॥ యె॥

చంద్రమతి॥ ఇదియేమివెరపునా హృదయమేళచిత్రము– సదమలసత్య సంపదగలవాడవు – యదరకూ బెదరకూ చెదరకూ పదరపలదిక॥ కలు॥

రాజు॥ పడతీయేమని నుడువగనేర్తునే– కొడుకుతో మనమింక కడు దుఃఖములబొంది–తడవులే కడవుల నిడుములా బడితిమయ్యో॥ యె॥

చంద్రమతి॥జగతిని బెడుదూరిలజనేత్రుమికరుణ -- నగణితధీరాత్మ బొగడగనీవుడొంది– దిగులుచే బొగులుచూ వగచెదూతగునెనీకు ॥కలు॥

——మాటలు॥ ప్రాణేశ్వరా! పదునాల్గుభువనంబులు గడిసిన బెదరని నీవు నిదురబోవుచు నుదరిపాటుచే గలువరించెద వనివార్యశౌర్యధుర్యం డవై కరుణాగత వైరిరక్షణుండవై దుర్వార గర్వాకరదర్వీకరపరివంధి బాహుబల వనదహనుండవు. సప్తసాగరపరివేష్టిత ఖండభూమండలాధీ శ్వరుండవు. నిత్యవచనరచనా వికారదూరుండవు నీకిట్టి భయభ్రాంతియేల కలిగె. కలువరించుటకు కారణంబేమి స్వామీ॥

రాజుమాటలు॥ ఓపడతీ! కడుకోపంబున నొక్కభూసురుండు గ్ర క్కున నాశిరంబుననుండెడి కిరీటంబు ధరాతలంబునబడునట్టుకాలితోదన్ని ధట్టించియీడ్చినట్టు మనమడవులలో నిడుములబడినట్టుకొడుకునునిన్నుడ బాసి బహువిధంబులగుబాధలకోర్చి చండాలునింటిలోనేబనులొసర్చినట్టు పిమ్మట దైవానుగ్రహంబున రాజ్యమేలినట్టు గలగంటిగదావాలుగంటీ।

చంద్రమతిమాటలు॥ ఓభూమండలాధీశ్వరా! ఇంతమాత్రమునకై మీరేల జింతించెదరు. మిమ్మింతసేయగ దలంచినవాడువిశ్వామిత్రుండు సుమీ, యమ్మునీంద్రుండు నీపై జలపట్టి బొంకించుటకు కంకణముగట్టు

కొన్నాడు. మీరింక శంకలేక సత్యంబు మరువకున్న మిమ్ములరాజ్యంబు మరల ప్రాప్తించు భూపాలకా॥

మంత్రిమాటలు॥ రాజేంద్రా! ఈవనంబువిశ్వామిత్రమునీంద్రుని దయ్యా॥

రాజుమాటలు॥ నీకెట్లు తెలుసునయ్యా॥

మంత్రిమాటలు॥ రాజేంద్రా! మీరు నిద్రించుచుండ నొక్క మునికుమారుండు సమిత్కుశఫలార్థం బిచ్చటికి వచ్చిన నేనతని నడిగి తెలుసుకొన్నాడ స్వామీ॥

రాజుమాటలు॥ సత్యకీర్తి! యామునీంద్రుడె నాకిట్టి దుస్స్వప్నంబు బుట్టించినట్టు దోచుచున్నది, కౌశికు నాశ్రమంబునకుబోకుమని వసిష్టులు చెప్పియుండిరి. యామాటలుకలువినియు గనక మృగతృష్ణాకలితుండనై ఇంత దవ్వరుగుదెంచితి నింక నకంజేమి ఇక్కల బెట్టుగదా మంత్రిపుంగవా॥

మంత్రిమాటలు॥ రాజేంద్రా! తొల్లి మీతండ్రియగుత్రిశంకమహా రాజునకు వసిష్టకుమారులుశాపంబుబెట్టినచండాలుండయ్యె, నాతనిచేపట్టి శాపవిముక్తినిజేసి దుర్గమంబగు స్వర్గంబుకలుగజేసిన యామునిభర్గుండు నిష్కారణంబుగ మిమ్మేలఇక్కట్టు బెట్టు. నెక్కడిమాటపోవనిండుస్వామీ॥

రాజుమాటలు॥సత్యకీర్తి! విధికృతంబుగడువ నెవ్వరికిశక్యంబుగాదు, మనమింకబురంబునకుబోదము. త్వరితంబుగరథంబుగడుపుమాసత్యకీర్తి॥

మంత్రిమాటలు॥ రాజేంద్రా! అట్లనేబోదాముగాని, గానకళా విన్యాసంబు గల మానినీమణు లిరువురుమిమ్ముగానవచ్చుచున్నరీతినిగను పట్టె. గావున, వారిని బహూకరింపకున్న మనకపయశంబు రాగలదు. కాబట్టి వారిని సత్కరించి పోదము స్వామీ॥

రాజుమాటలు॥ అట్లనేగానిమ్ము మంత్రీ॥

విశ్వామిత్రుడు – నాటరాగము – ద్విపద.

ఈహరిశ్చంద్రుండునింతయుదాను–శ్రీహరికరుణనేజింతించునట్లు– నావనభూమికున్నతముగావచ్చె నేవిధంబుననైననితనిబాంకింప – నిదివేళ గావుననెలమిమాతంగ– సుదతులనిరువురసురుచిరంబుగను బుట్టించిపంపిన భూపాలుజేరి–దిట్టతనంబున కెరవలునతని – గోరికామించినకువలయేశ్వరు డువారిరూపంబులువారినిల్కడలు – వారివీణావేణువాద్యఘోషములు–శా రాజుసంతోషమహాత్మరెట్టింప – మదనసమ్మోహనమార్గణావళుల–హృద యంబుబెదరిమహీపాలుడిపుడు – ధరణిశ్రీబెడుదూరుధామునిమరచి–పరగ

సత్యముబాసిపదతులబోండు॥—మాటలు॥ఆహా! నాపుణ్యంబున నిమ్మనుజనాయకుండు మదీయాశ్రమంబు జేరగ వచ్చి పోవుచున్నాడుగదా. నా భాగ్యంబు ఫలించె నాకోర్కె సిద్ధించె నింక మదీయ్యతపః ప్రభావంబున సురగరుడకిన్నర పన్నగభామినులకన్న మిన్నలగు వన్నెచిన్నెలుగలమాతంగకన్నియల బుట్టించి పంపెదగాక॥

మాతంగకన్యకల వేషము—ద్విపద—శంకరాభరణము.

అంతవిశ్వామిత్రుడతివిచిత్రముగ— గాంతలనిర్వరగదురూపవతుల మాతంగకన్యకలసుందరయానలను—బాత్రిగాబుట్టించి పంపినవారు—మెరుపుతీగలరీతిమేనులు చెలగ — కరమునవీణలగైకొని సకల—భూషణంబులదాల్చి పొలతులుమధుర—భాషలాడుచు దేవభామినులనగ మదనునిమోహనమంత్ర దేవతలు—కుదురుగా వచ్చినకోలదివారపుడు—సరసుడౌ యాహరిశ్చంద్రుని జేర—నరుదుగావచ్చిరియజ్ఞాతులపుడు— ఘనముగా బెడుదూరుగరుడవాహనుని మనముసదలపక మగువలవ్వేళ॥

దరువు—శంకరాభరణము.

తాళగజాలనే బాలా—భూమిపాలునిజూడకీవేళా॥ తాళ॥ పూలవిల్తువిరికోలలుమెదనాట—బాళిమించెనికజాలి కేనోర్వను॥ తాళ॥ మారశరునకు సమానుడై వెలసిన—మానవనాథునిమానుగజూడక॥ తాళ॥మీరినవగబెడుదూరులోవెలసిన—శౌరినిబోలిన జనపతిజూడక ॥తాళ॥—ఉ॥ ఓవరనాథచంద్రవినుముజ్వలవై భవసాంద్రచంద్రికా। మానయుశోవిశాలఘనమాతనభూషణజాలసత్యసం!ధానవిచక్షణా శ్రితనిధానవిభాకర తేజసత్యముల్। దీనులపాలికల్పకసుధీజన ప్రొముక్కెద మాండరింపవే॥—మాటలు॥ ఓహరిశ్చంద్రమహారాజా! సప్తద్వీపవసుంధరాధీశ్వరా! భూరిప్రతాపదూరీకృతవైరికోటీరసంఘటిత మణిరంజితపదకంజయుగళా॥పది వేలువందనంబులు స్వామీ॥

రాజుమాటలు॥ నారీమణులారా! మీరేకులంబువారు, మీతల్లిదండ్రులపేరేమి, ఇచ్చటికేలవచ్చితిరి. మీకు గానపాటవంబు గలదేని, యొకపాటవినుపింపుడు. ప్రేమచే మీగానంబువిని బహూకరించిపంపెద కామినులారా॥

మాతంగకన్యకలమాటలు॥ రాజేంద్రా! వినుమేము విశ్వామిత్రునీ కూర్మిపుత్రికలము మాతంగ కన్యకలము. ప్రీతిచే మాగానంబు మీకు వినుపించి సన్మానంబుబడయవచ్చితిమి, మీయాటపాటలువినుము

దరువు-రేగుప్తి-అట.

నిత్యు నాచిత్రమి మాకన్నులకుబడుగ నన్నితింతుము హరిశ్చంద్ర మహారాజా-నెన్నుమీరనిరించుచున్న మచందమున-కన్నవన్నెలుగుల్కుచున్న మోమునుగల్గు॥ని॥కనుర్రైన మీదివ్యపదదర్శనమున సంపడగల్గునో భూమిపాలవతంస-విదితమాసప్తసంధి నేలావృతభూమి-సుజతి నేలరాజశూరులనంకర-ముకమనుటకిన్నానదిమికప్పమునుగ్గైకొనుచుసమ్మదమొద వసత్యముపదలనియ్యకెను దొడరుందు కీడులగలిసిచయ్యానజదియు జేయుదునుశరణన్న వారల బెదరవమాన్పు మానిజాపృచుము-నామీదకన్గవ - తుదల చూడ్కులుతొడలజాచుచునదరబింబమునగదలగాప్పృదు - మధురభాషల నాదరించుచుపదవులిచ్చి సబంధుజనసుతు॥ని॥ వారిజబాంధవవంశవారిధిసుని చారాభూరమణాబ్ధిభూరిగంభీరా - ధావని శ్రీబెడుదూరుమందిరుపాద - వారిజములమతిగోరిసుతింపుచు-సూరిజనములజూచిబ్రోచుచును- నీకన్న కొడుకులతీరగాబురివారిజాచునును నిజధైర్యరమచే మేరుశైలముగేరిని ల్పుచును-దీనాళికెప్పుడవాంఛితరముగభూరియిచ్చుచును, నెలవుడుయాజం భారివిభవమునిమీరకుద్రెద్దీరఫణిబాహ్యారిజారిపురారి నారదశారదాభ్రతు షారకీర్తిస్ఫార రాజిత॥నిత్యు॥—మాటలు॥ మహారాజరాజపూజితపుణ్యమూర్తిదుష్టజననిగ్రహత్వప్రసమవర్తి శిష్టజనదయామువర్తి హరిశ్చంద్ర మహారాజచక్రవర్తి విజయీభవరాజేంద్రా॥

రాజుమాటలు॥సత్యకీర్తి! ఇమ్మానినీమణులగానకళాప్రావీణ్యంబు వింటివా. ఈపల్లవాధరులుబట్టియున్న వీణలు పల్లవించె. ఈనారీమణులు ధరించిన హారమణులు కరంగి నీరుగారక దొడంగె. గాన, వీరలకనేక వస్త్రభూషణ ఘనసార సుగంధతాంబూలాదులిచ్చి పంపుమానత్యకీర్తి॥

మంత్రిమాటలు॥ మాతంగ కన్యకలారా! మాభూతవాధిపుడు మీయందు ప్రీతుండై వివిధాంబరాభరణంబులు బహుమతిగా నిచ్చె. గైకొనిపొండు కామినులారా॥

మాతంగకన్యకల లాహుణి॥ మహారాజమహారాజా రాజమణిమండితపృదుపదకమలా- కమలాసనాదిదిక్పాలవినుతశరజాలాశరజాలశరజాలవినిర్జితశరణాగతపరిపంథిపరిపంథినిశీధినిభంజనకరమార్తాండమార్తాండ మార్తాండవంశపరవార్తికసుగుణాక్రాంత ఆక్రాంతాంబుధివలయాఖిల భూసరిపాలపరిపాలపరిపాలభూరిసురభామి నీచిత్తభుజంగిభుజంగపరీవృథ

భోగసదృశభుజదండ-భుజదండభుజదండ కలితమణిభూషణభూరికృపాణ-కృపాణవిపాటితక్రూరమనుజచతురంగ-చతురంగ చతురంగ భువనగుణసారవిభవదివిజేంద్ర-దివిజేంద్రవాహకుందేందు శరద్ఘనసార - ఘనసారఘనసారహీరదరతారయశస్సముదార- సముదార బెజుదూరినత్పురవర శ్రీకాంత-శ్రీకాంత పాదసరసీరుహాసీధురసాళీ - అళీజన మృదుమధురాలాపములాలించి యాలించియాలించియొనరనీలాలితమగుచత్రంబుచత్రంబుదక్క ఈభూషణజాలము లేలామహారాజ॥—మాటలు॥ రాజేంద్రా! నీవు నిఖిలభావజ్ఞుడవు, రసికజన శేఖరుండవు మానినీసన్మానుండవని నిన్ను గానవచ్చితిమి. మాకోర్కి దీర్పుము భూలకా! మాకవియేల? చండకిరణుని యెండచే బెండుపడివచ్చితిమిగాన, నీగొడుగిచ్చిరక్షింపుమా రాజేంద్రా॥

రాజుమాటలు॥ ఓకన్యకలారా! మదీయశ్వేతచ్ఛత్రంబు మీకడుగఁ దగునే. రాజచిహ్నితంబులైన చత్రచామరంబు లితరుల కీవ్వ నగునే. తెలియక మీరడిగితిరి. ఇప్పు డలుక లేక మన్నించితి యావస్తువులుదక్క తక్కినపదార్థంబు లెవ్వియైన నిచ్చెద నడుగుడు బాలికలారా॥

రాజమతంగస్త్రీల సంవాదము-దరువు-కేదార-రూపకము.

జననాయకవినుమా-ఘనముగ మామనవిఁకను॥ జన॥ అనుపమమారుని కేళికినువగు ఈవనసీమను-మనమునబల్కనికరమును-బెనగొనమమ్మును గూడుము।జన॥

రాజు॥మీననయనలారా-మానుడు మీరీపదరతలు॥ మీన॥ మీనిలుకడమీనేరుపుమీనాణెము నేనెంచితి-మానుగ మీగానము విన్నానిక బహుమానించెద॥మీన॥

మతం॥ జగతీతలనాథా-తగదిక పుముదిగనాడగ॥ జగ॥ మగువలకైంతగులము కోరగరాదేమగ రాయడ-రగడైనను అగడౌమా-మగుడవు నీవగుడాయుము॥జగతీ॥

రాజు॥ మాలపడతులారా-బాలికలనితాళితిక॥ మా। లాలితమగుగానకళాశాలులనుచులాలించితి-చాలును మీయాలాపము - బోలగవిననజాలను చీ॥ మాల॥

మతం॥భూతలపతివినుమా -నీతిమె మీకీతలపుకు॥ భూ॥ ఖ్యాతిగమామమిాజనకునిజాకియుమ -జాతియునొక- రీతియెగదమాతో రతిసేతువు పదప్రీతిగసిక॥భూత॥

రాజు॥ వారిజముఖులారా— సారెకుమిత్రిమీరడుకీక — ధారుణిబెడుదూరీశ్వరు—గోరికతో గాసియూడుడు—నారీమణులారా యిక— నోరెత్తినగారించెద ॥వారి॥ —మాటలు॥ ఓకాంతలారా! స్త్రీలపై గోపంబు సేయఁ దగదని యెంతసహించినా దండిగ కల్లుద్రావి కండక్రొవ్వుచే గుసుమకోదండుని ఖండనంబు గోరెదరు. దర్శనస్పర్శనంబులకు దగనిమగువలై యుండియు దిగులుమాని తెలివిదప్పి పలికెదరు ఇంక నోరెత్తిన నాలుకలుగోయుదుసుమీ॥

మతంగకన్యకల—సీ॥ న్యాయమా మీకిది శ్రేయమా మావంటి తోయజాక్షులనిందచేయుటకును పొందుమా డెందమింపొంద మాతోడ మాకందభూజచ్ఛాయలందు నేడు। ధీరమా తోడగూడ భారమా సౌందర్యమారమా జేసిన నేరమేమి। పంతమా మీకుసుస్వాంతమా మహారాజ మామకవలవంతయంతదీర్పు। జారసేకరయింతవిచారమేల। మారకర్ణకఠోరహుంకారతాప। మారమిముగోరి జేరిననాదరించి। కామినీకామదము జేసి ప్రేమనేలు॥ దరువు— కేదారరాగము—ఆది.

యాల యీవెడమాటలాడెదవు—భూపాలకులమణి॥ యా॥ చాలక వినురసారమారుని కేళిదయమమ్మేలు నృపకులమౌళిపై పోలునే చలమేలా ఈవేళ నేతాళగజాలను॥ యా॥ మన్నదారవగునిన్ను నాదగుకన్నులలరగ గన్నదానను—కన్నడాసేయకుపన్నగ వన్నెల—చిన్నెల—సన్నెలుక॥ యాల॥ వేయునేటికి తోయజాక్షులమైనమముదయచేయుమికగలాయమైయీయెడ కోయిల—గూయగ—కాయజుడేయగ॥ యాల॥ ధర శ్రీబెడుదూరుశ్వర—శౌ. సాక్షిగ జేరితిమి మా—గోరిక—దీర్పుమా—మారుని— బారికి — నోరువ — జాలము॥ యాల॥ —మాటలు॥ రాజన్యతిలకా! వినుముగణ్యలావణ్యంబుగల మావంటికన్యల జూచిన వన్యాంతరంబుల నుండెడిమునీంద్రులకైన మదికరంగదె మీకీయన్యాయమేల, కడునింపడర నీతోపడకసుఖంబనుభవింపక మేముడుగుబెట్టి నడువజాలము, ఇంక తడవేల, నీలతాభవనంబున కమ్మవిలుకాని కేళికి కలయుదము లెమ్ము. నీకరంబిటు తెమ్ము రాజేంద్రా॥

రాజుమాటలు॥ మంత్రీ! చూచితే. ఈమాతంగవతులు దిగులుమాని తెగువచే నారెట్టబట్టవచ్చెదరు, వీరినిమగువలని యోర్వదగునేమయ్యా, నాదైన దుర్వారగర్వాకర దర్వీకర భీకరంబైన కోరడాచే వీరివాళ్లుపగల చీల్చి పుచ్చెద లేవయ్యా॥

మంత్రి దరువు - బేగడ - ఆది.

మనుజేశ విను మీ వనజాతు శాత్రులజను నేళికింపగ సార్వభౌముడ వయ్యో॥ మ॥ పగవారె యీకీలాలపడతులుంచియా వేళ - జగతీశయీలీలశాసించుటకుమేలా॥ మ॥ రమణీ శ్యామా త్రి బూరమణా రాజితకీర్తి - రమణులు గావున రక్షించుదయతోన ॥మ॥ సజ్జనులగుణసాంద్రా సత్యహరిశ్చంద్ర- విదితమా బెడదూరు వేంకటేశ్వరుతోడె॥మ॥—మాటలు॥ రాజేంద్రా! ఈబోటుల పైటచెఱంగులు వైరికోటులమేటిచేతనంబులుగావు. ఈపంకెజాక్షుల కనుబొమ లరివీరుల శరాసనంబులుగావు ఈకోకిలవాణులకోకస్తనంబు లస్త్రోశాహిత దుర్గమండలంబులుగావు. ఈపడతుల తొడలు విద్వేష మండలాధీశ్వర వేదండ కరదండంబులుగావు. ఈమృదుగాత్రల నేత్రంబులు శత్రుజనులశస్త్రాస్త్రంబులుగావు బూరమణా! వీరికోపంబు మాని కృపజూడుము. నాపలుకులాలకించి వీరినిరక్షింపుము దీనయాచక రక్షా! దుర్జనశిక్షా॥

చంద్రమతి దరువు - నాదనామక్రియ - ఆది.

భానుకులేశ్వర పైడిమ్మృగంబును కానననీమనుగన్నామ॥భా॥ మృగయాశను ఈముని వనమునకును జగతీశ్వర రావలసెనునయ్యో॥భా॥ మాపుల కింపగు రూపము మాలల కేవ్వనగల్గునె యిలలోనా॥ భాను॥ గాధిసూనుని మాయాకల్పనల మ్మాశ బాధలపుట్టక బాయునేహో॥భా॥ ధరణిశ్రీ బెడదూరు దైవము సాక్షిగ-గురుడు చెప్పిన నీతిమరచితి వే॥ భా॥—మాటలు॥ దాత్రీశ్వరా! ఈవిశ్వామిత్రుండు ఇంతటిచిత్రంబు కల్పించెనని తెలియవలదే. గాధేయు నాశ్రమంబునకు బోవలదని వసిష్టులుబోధించి చెప్పినమాటమరచితిరే. ఈలతీమణులు మిమ్ము జేరి మారుకేళి గోరిన మీరట్టె కొట్టితిరకటా! వీరుపోయి చెప్పినవిశ్వామిత్రుండు పటుతరాగ్రహంబుచే మిమ్ము నేమి బాధించునో ప్రాణేశ్వరా!

రాజుమాటలు॥ తరుణీ! దైవయత్నంబునకు దిగులుజెందవచ్చునే, అయినది కానిమ్ము తలోదరీ॥

మతంగకన్యకల మాటలు॥ మునిపుంగవా! మేము నీవు బంపగ బోయి యాహరిశ్చంద్రుదగ్గరి యనంగ సంతాపంబున బ్రార్థించిననా పార్థివాధముండు కోపంబుడింపక కశాఘాతంబున బాని సెతోత్తులమొత్తిన రీతిగా బెట్టుగకొట్టెను స్వామీ॥

విశ్వామిత్రుని దరువు-నాట-రూపకము.

భళిభళిరేమిమ్ము భూపాలుండుకొట్టైనా- చెలువబరమతో ప్రపళిఖ నెరుంగదుగా॥ హరిహర బ్రహ్మదులడ్డగించినను- వరువడిగ వాని నేభస్మంబు జేతు॥ భీమణాకారుడై బెడుదూరుధవ్రుడుపోషించినను వానిబూమిగై కొందు మాటలు॥ కన్నియలారా! యీరాజకులాధముండు అహంకారంబున బెట్టుగమిమ్ముగొట్టెనా కల్పాంతసమయా నల్పకోపాటోపాంధదారసురవైరిపాలనేత్రాభీలకీలాసమంబగు మదీయ్యాగ్రహంబు నేరీతినిగ్రహించునో చూచెద. హరిహర బ్రహ్మదు లడ్డపడిన విడువక సర్వరాజ్య సంపదల హరించి పదభ్రష్టునిగావింప విడుతునే కన్యలారా॥

రాజుమాటలు॥ ప్రాణనాయకీ! తుద్రమతు లగు పురాసురులపై బడు రుద్రునిరీతిగా, రౌద్రోద్రేకంబున వచ్చెడి విశ్వామిత్రునిజూచితే. గడకంటిమంటలుమింటికెగర జేయుచుప్రచండభుజాదండంబున దండంబు బట్టుకొని ధారుణిపై జటాభారంబుజీరాడ పటపటాత్కారంబుగా పండ్లు గొరుకుచువచ్చె నితనిచే మనరాజ్యంబునాశనంబాయెనే వారిజాక్షీ॥

చంద్రమతిమాటలు॥ ఔను, ప్రాణేశ్వరా మీరు ధైర్యము నవలంబించి సత్యంబు మరువక వర్తింపుడుస్వామీ॥

రాజుమాటలు॥ పది వేలవందనంబులు విశ్వామిత్రమునీంద్రా॥

విశ్వామిత్రునిమాటలు॥ ఒరే రాజకులాధమా! జగతిలోరాజులు లేరా. వేటకురారా. క్రూరమృగంబులజంపరా, దారుణాటవుల విహరింపరా. మాయాశ్రమంబుజొచ్చి విచ్చలవిడి దిరుగుటేగాక. మత్కుమారీరత్నంబులు నిన్ననుసరించవచ్చిన బిట్టుగాకొట్టితి వటరా॥

రాజుమాటలు॥ విశ్వామిత్రమునీంద్రా! నాకిరీటంబున నుండెడు మణు లొత్తుకొని మీపాదంబున కెంతనొప్పికలిగెనోగదా స్వామీ॥

విశ్వామిత్రుని ద్విపద-నాట.

ఓహరిశ్చంద్రయోరిదురాత్మ - నారీణులయందునయమింతలేక - కోపంబుచేసిపుక్కొట్టినందులకు-బాప్రరేనామదిబాదగావించె- నొకపాదమేగాదుయుర్వీశనాకు-సకలాంగమును నొప్పిసల్పుచున్నవిర-హరిహరబ్రహ్మదులడ్డగించినను-బరువడిగానిన్ను భస్మంబుసేతు, నన్నెరుంగవెయోరినలినాస్త్రకులుండి-పన్నగాబెడుదూరుపద్మాత్ములోడ॥ మాటలు॥ ఒరేహరిశ్చంద్రా! నీవుచేసినపనికి నాకొకపాదంబు నొప్పిగాదురా. నిఖిలాంగంబు

లుడుకుచున్నవిరాద్రోహీ! తొల్లింటికాలభూవల్లభులునీవలెను త్తచిత్తులై మునివనంబులుపాడుచేసిరే. నాయాజ్ఞ లేని దేనాయాశ్రమంబునకువచ్చుటే గాక, సేవించినచంచలాక్షులశిక్షించితివిగాన,నిన్నుహరిహర బ్రహ్మాదు లడ్డగించిన నాకోపాగ్నికీలలభస్మంబు చేయక విడుతు నేమిరా ద్రోహీ॥


హరిశ్చంద్రుడు.


విశ్వామిత్రుడు.

రాజుమాటలు॥ స్వామీ! ఈమునిప్రచండకోపంబునేనెట్లు సహింతును దైవమా॥

చంద్రమతి ద్విపద-తోడి.

ఇది యేమి దేవనీవిట్లుచిత్రముగ-మదిలోనచింతింపమానికోపంబు-మాను నెయ్యటుగానమానవాధీశ-భానుకులంబునబరగజన్మించి గరిమతో సత్యసంకల్పంబుగాక=ధరణీతలంబెల్ల ధర్మమార్గమున-పాలించితివిభూమి పాలనీవింక-పోరునేధైర్యంబుపోకార్చి యిట్లు వగచుట బనిలేదువసుధగౌరి కుచ-నగభేదిమొదలుగనఖిలదేవతలు-గరుడకిన్నర యక్షగంధర్వదైత్యా-సురసిద్ధసాధ్యులుచూడభీతిల్లి-పరి పరివిధముల బారుచుండుదురపుడమీశ వినుము యీపుణ్యావర్తముని-కడిగిప్రార్థింపు కరుణించునిన్ను - పన్నగా బెడుమూరు పద్మాక్షుతోడు॥

దరువు-తోడి-రూపకము.

యాలభూపాలా నీవిటులసడలిసడలదగదీ వేళా॥ భూ॥ శీలంబున సత్యము పరిపాలించినజాలు జాల మేలా మంజులపదవాక్యంబులమానుగ ప్రార్థింపుచుపాద భంజననీవీమునివర కుంజరుపద కంజంబుల కంజలియని రంజిలజన॥ వే।పంకజభవరుద్రాదులు పాలించిననిన్నితడు బొంకింపగదల చెనునృప శంకరవిను మంకితముగ పొంకముగానింకశంక॥ వే॥వారకబెదు

దూరీపుర శౌరినిభజయించినమిము గోరికతో బ్రోచునుజడదారికికరుణా రసపరిపూర్ణంబునుమిారజేర॥ వే॥—మాటలు॥ భూపాలకా! విను మాప త్కాలంబున ధైర్యంబును, ప్రస్తుతకాలంబున శాంతంబుకలిగినభూ కాంతులు యశోభివృద్ధియువిభవసమృద్ధియుగల్గి వర్ధిల్లుదురని పెద్దలు చెప్పెడు ధర్మశాస్త్రపద్ధతులవినలేదా గాన నిమ్ముని కినుకదీర వినయం బున కనికరంబు కలుగునటుల ప్రార్థనంబు చేయుదము ప్రాణేశ్వరా!

రాజు ద్విపద–శంకరాభరణము.

ఓమునికులవర్య యోమునిశ్రేష్ఠ–ఓమునివ్యాఘ్రమ యోమునిప్రవ రనీకెదురించియానీరజాసనుడు – కాకోదరారిసంఖాణుండు భవుడు–సురలా దిగానిన్నుజూడనోడుదురు–కరుణాఢ్యవినుమునీకడదికోపమున కేలెంతవా డనీవీకురాగ్రహము మానిరక్షింపునామనవిగైకొమ్ముజడదారివై యింత చలమేలనీదు–యడుగులేగతినాకునపరాదినన్ను – కరుణింపవేదయాకర మూర్తివగుచు–ధరణిశ్రీబెడుదూరు ధాముని తోడ॥

దరువు–శంకరాభరణము–ఆది.

మునినాయకావిను– మోదముగైకొను॥ము॥ననుబ్రోవుమింకనునా తప్పులోగొను॥ముని॥ నాయెడనీదయ చేయవ దేవయా– కాయనుకోయను కర్తావునీపవో॥ము॥తల్లియుదండ్రియుదైవముదాతయు– తెల్లమునీవని దెల సితినెమ్మదిముని ననితము బెడుదూరిపురవాసుసాక్షిగా – వరదుడవై నను కరుణతోగైకొను॥ము॥–మాటలు॥ఓమునివ్యాఘ్రమా! నీదురాగ్రహంబు సహింప నుగ్రాత్మునకైన శక్యమా. నేనెంతవాడ. నీకింకరుండ. నాయప వాధంబులెన్నక నన్నుమీాకన్న పుత్రునివలెరక్షింపుముస్వామీ! ఈచరా చరంబులన్నియు మీాయలుకలోనివిగాదెలిసియుదెలియక నేనొనర్చినతప్పి దముగాచి నామొరాలించి కరుణింపవే దయానిదే!

విశ్వామిత్రునిమాటలు॥ ఒరేహరిశ్చంద్రా! వినుమ. తాపసులకు కోపంబున భావంబు చేకూరును. గాన,నీతప్పుసైరించెద. నేచెప్పినమాట చేయుదువా॥

రాజుమాటలు॥ అదియేమో సెలవిండుస్వామీ॥

విశ్వామిత్రునిమాటలు॥ఒరే గడురూపవతులైన ఈకాంతలవరిం చితివేని, నిన్ను నిఖిల భోగభాగ్యుని గావింతు. సురేంద్రాదులు నీపంపు చేయునట్లునీచేతసకలలోకంబులు నేలించెద. నామాటవినరా రాజేంద్రా॥

రాజుమాటలు॥ఓమునీంద్రా! ఈచండాలకన్నియల బెండిలియైయా ఖండలసౌఖ్యం బనుభజించుటకంటె నా రాజ్యంబునైన విడిచెదనుస్వామీ॥

విశ్వామిత్రునిమాటలు॥ ఒరే హరిశ్చంద్రభూపాలా! నీవునిత్యశీలుండవు, పలికి బొంకనివాడవు నీమాట బహుసమ్మతము కొన్నిదినంబు లీ భూమిని మే లెదము. కావున, నింక ఆలస్యంబుచేయక మాకొసంగుమా రాజేంద్రా!

రాజుమాటలు॥ఓమునీంద్రా! వినుఁకొన్నిదినంబులీభూమిమీ రేలినదేగదా!పరీక్షార్థంబునన్న డిగెదరుకాని మీకురాజ్యముపై గాంక్షగలదా॥

విశ్వామిత్రునిమాటలు॥ ఒరేహరిశ్చంద్రా! ఈటక్కుమాటకు నే చిక్కుదునే. యేటిమాటలాడెదవు, కల్లనైన బొంకవనివింటి, నీవు సత్యవ్రతుండవేని ఈధాత్రిమాకొసంగుము. లేనియెడబొంకితివనుము. కాదేని ఈమాతంగకన్యకల పెండ్లిజేసికొనుము రాజేంద్రా॥

చంద్రమతి దరువు—ఆదితాళము—తోడిరాగము.

యేలయోచనసేయభూమిపాలాశూనృతశాలివై కాలరీతినిగడుప నెవ్వరుజాలరో కరుణాలవాల॥యే॥ సూనృతంబుకంటె సుకృతములేని సంగ తెరుంగవె—పూనుగాయిమ్మునివరునకు భూని రాజ్యమొసంగుము॥ యే॥ధాత్రిదానముసేయుటకు సత్పాత్రమబ్బెనుగాన — విశ్వామిత్రునకు సామ్రాజ్యమిచ్చి సమిత్రకులముపవిత్రమాయెను॥యే॥పలికిబొంకుటపాడిగాదని తెలియవలదెమహాత్మకా—ఇలతలేశ్వరయిమ్ము యీమునితిలకునకు సామ్రాజ్యము॥యే॥తవనకులసంభూతిబెడుదూరిదైవరాయని సాక్షిగా—విపులసత్యమునిడువడగునెన్నృపశిఖామణిసఫలమాయెను॥యే। మాటలు ప్రాణేశ్వరా॥ విశ్వామిత్రునకు సర్వరాజ్యమిచ్చిన మేలయ్యె. మనమింక గిరికందరముకరిగి తపముసేయుదుము. ఈమునీంద్రుండు దొలిరాజ్యత్యాగంబుజేసితపమొనర్చినందునగద ధాత్రిలోపూజ్యుండై బ్రహ్మర్షి పదంబు నొందెగాన, నీరసమూనింపక రాజ్యంబునిమ్మునికివ్వుముస్వామీ॥

రాజుమాటలు॥బాలా! మన్మనోకూలంబుసు జగద్భరిత యశోమాలంబునైన నీవాగ్జాలమునవామదికలకదేదెకలికి! ధరణిలోపురుషుల కనుకూలవర్తియగు భార్య కలిగెనేని వారిపుణ్యంబునెన్నుటకుపన్నగపతికైన శక్యమాభామా? ఇంకతడవేల॥కనకకలశముతో నుదకముదెమ్ము, ఇమ్మునీంద్రునకు దానధారాపూర్వకమ్ముగ రాజ్యమిచ్చెనే రాజముఖి॥

చంద్రమతిమాటలు॥ ప్రాణేశ్వరా! మీయాజ్ఞానుసారముగ కనక కలశముతో జలంబుం దెచ్చితి లింతతడవేల? నిమ్మనియడుగులు కడిగి ఈమునీంద్రునకు ధాత్రిదానం బివ్వుము స్వామీ॥

రాజుమాటలు॥విశ్వామిత్రమునీంద్రా! నీకీధాత్రదానమిచ్చుటచే నాగోత్రము పవిత్రంబయ్యె రండి స్వామీ॥

విశ్వామిత్రునిమాటలు॥ ఇదిగోవచ్చితినయ్యా రాజా॥

రాజుమాటలు॥గాదేయా!వినుు, దేవబ్రాహ్మణవృత్తులుదప్పదక్కన సప్తద్వీపవసుంధరాతలంబంతయుమీకిచ్చితినిసుఖముగా నేలుకొనుమయ్యా

విశ్వామిత్రునిమాటలు॥నిత్య సత్య యశోవిభవాభివృద్ధిగల్గి వర్ధిల్లుమా రాజేంద్రా॥

రాజుమాటలు॥ సత్యకీర్తి! ఈవిశ్వామిత్రునకుసర్వరాజ్యమిచ్చితి, నితనిప్రాపున మంత్రీత్వముచేయుచు సుఖముగనుండుము నేనిదెయడవులకు వెడలెదనయ్యా॥

మంత్రిదరువు—ఆనందభైరవి—అట,

మానీక్కృతమిటు జేసె నే—పూనితిరినిను బాసె నే॥మానీ॥ మానినీమణి మానులకానలనోనలమానవేశ్వర మెట్లుబ్రోచెదు నేనువచ్చెదనిన్ను గొలుచు॥మాని॥ తల్లిముంగలిపిల్లగానెల్ల దినములుచల్లగా యుల్లమరగయుంటినేబూనల్లభానే జెల్లనయ్యా॥ మాపౌరజనములచింతయునెవ్వారుదీర్చెదరింతయు - కోరిశ్రీబెడుదూరునిలయుడౌరచేసెనెయింతయు॥ మాని॥— మాటలు।రాజేంద్రా!నిర్దయాశాలియగుఇమ్మునిశార్దూలమునకునన్నొప్పగించితివే. ఈతనికోపమునకు నేనెట్లువర్తింతు. బెబ్బులిభారిబడినజింకలరీతిగానితనికడ పుడమిజనులెట్లు కడతేరగలరకటా!ఇక్కడనేనెట్లునునిల్వనేర. నీవెంటకంటకారణ్యంబులమిమ్మురక్షించుచువచ్చెదను స్వామీ

రాజుమాటలు॥మంత్రీ! నీకుబ్రతుకుపై నాశకలదేవి నేచెప్పిన విధంబున నితనికడనుండుము. మరియొండుబలుకకుముసత్యకీర్తి! ఓమునీంద్రా! మాకడవికి సెలవొసంగు మిదె పది వేలు వందనములు స్వామీ॥

విశ్వామిత్రునిమాటలు॥ఒరేహరిశ్చంద్రా! పోయివత్తువుగాని చిహ్నితములైన కిరీటాదిబూషణంబులు చంద్రమతిధరించినరత్నఖచిభరణములుమాకొసంగి నారచీరలుధరించి యడవులకుబోయిరావచ్చు

రాజుమాటలు॥ మంచిదట్లనే ధరించెద తెండి స్వామీ ! చ

మతీ! నీసొమ్ములన్నియుతీసి ఇమ్మునీంద్రునకివ్వుము, నీవునారచీరలును ధరింపుము. పోయివత్తము. పద. తలోదరీ॥

చంద్రమతిమాటలు॥ ప్రాణేశ్వరా! మీయాపతిచెప్పిన మదీయ రత్నభూషణంబులిమ్మునికొసంగితి.వింతతడవేల? నడ్తలకుబోదముస్వామి

రాజుమాటలు॥ మునీంద్రా! పదివేలువందనంబులు ఇంక పోయి వచ్చెదము. మాపై దయయుంచుము స్వామి॥

విశ్వామిత్రునిమాటలు॥ అట్లనే పోయిర యెంతదయ యుండునో అంతయుండును రాజేంద్రా! ఒరేహరిశ్చంద్రా! నిలు. నిలు. మాకునాడు యజ్ఞార్థంబు చెప్పిన ధన మివ్వక తొలగిపోజూచెదవా! నీవుసత్యవ్రతుండవె. నేనొకవేళ మరచిపోయినను నీవు మరచి పోవచ్చునే మాధన మివ్వుము రాజేంద్రా॥

రాజుమాటలు॥ మునీంద్రా! స్వరాజ్యంబు మీకర్పించితి. నింతటితో తృప్తిబొంది నన్ను విడువరాదా స్వామి॥

విశ్వామిత్రుని దరువు - కేదార - ఆది.

మాధనమిచ్చి సాధనము = కాదనుము లేదనుము = వాదముజేసిన పోదునే నేమధురనూధనుసాక్షిగనీదినము॥మాధ॥ పంకజమిత్రుడగులాంకుడవెశంకలేక యెటుజనియెదవుఅంకితముగ శ్రీశంకరుసాక్షిగబొంకితివనరా పొంకముగా॥మాధ॥ నెలవుకు నామాటలువిన్నా ఇలబెడుదూరులో నెల కొన్న=కలుములజవరాల్కాంతునితోడిజలజాక్షులపెండ్లిగమ్మా॥ మాధ

మాటలు॥ హరిశ్చంద్రా! మాకు రాజ్య మిచ్చెడికాలమున యీధనము జెల్లువేసి యేమైనానిచ్చితివా. యేటిమాటలాడెదవురా. పైకమిచ్చెదవా? బొంకెదవా? తెల్లముగ జెప్పరా రాజేంద్రా॥

రాజు దరువు = శుద్ధకాంభోజి - రూపకము.

నన్నుమీదయజూచి బ్రోవునన్ను తామరా=సంయమివర॥ నన్ను॥ యెన్నటికినీకెగ్గుజేయను-నిన్నశరణన్నానీ-కన్నాయెవరున్నారిక॥నన్ను॥ మునినాయకవినుమీనెల-దినములలో ఘనముగనీ = ధనమిచ్చెద దయ చేయుము=యనుమానముపనిలేదిక=కనికరమూనకరుణింపుమునన్ను॥సరసీరుహాభవభవమురహరులుసాక్షిగమీఋణమును- పరిపూర్తిగదీర్చెదన-న్నరమరచేసిరసింపకు పరమాదరభరితుడవై॥ నన్ను॥ యేపునబెడుదూరీశ్వరుప్రాపునసేబ్రతికినని - తాపసమీధనమిచ్చెదనాపై దయజూపుచునీ=

కోపం బెడబాపుమయి॥ నన్ను॥—మాటలు - మునీంద్రా! పంచభూతం బులు సాక్షిగా మీకిచ్చినమాట దప్పుదునే మీ బాకీపై కము దినదినము లకు సంపాదించి యిచ్చెద నన్నుదయచేయుము స్వామి॥

విశ్వామిత్రునిమాటలు॥ ఒరే హరిశ్చంద్రా! నీనమ్మకము మాకేమి? మా శిష్యుని నీవెంటబరాలెంబును పెద కూడిన ధనమంతయు నతని వశగతంబు జేసి మా అప్పుదీర్పుమా॥

రాజుమాటలు॥ మంచి దటులనే బంపండి స్వామి॥



చంద్రమతి. హరిశ్చంద్రుడు. విశ్వామిత్రుడు. నక్షత్రకుడు.

విశ్వామిత్రునిమాటలు॥ ఒరే నక్షత్రకా! నీకు భత్యాదారికినది రారా ఒరే॥

నక్షత్రకుని దరువు - అర్ధరూపకము - నాట.

వెడలె నక్షత్రకుడు ఝుడిఝుడితిమూర=అడుగులతో బుడమిగడగడ వడంకగను॥ వెడ॥ కౌశికుని యనుమతితో కాకుస్థకులుని - గాసిచేయగ నుగ్రగమనుడై యపుడు॥ వెడ॥ సారెకును బెడుదూరు శౌరిగాచినను=యారాజు బొంకింతు నేనను చుదలచిన॥ వెడ॥—మాటలు॥ పదివేలు వందనంబులు విశ్వామిత్రమునీంద్రా॥

విశ్వామిత్రునిమాటలు॥ దీర్ఘాయుష్మంతుండవై వర్ధిల్లరా నక్షత్రకా! నా శిష్యులలో నిన్ను మేలువానిగా వించితి నీవనేక మాయాప్రబుద్ధి కలవాడవు. నిరంతర కపటభాషా విశేషుండవు. నిర్దయుండవు, అతికఠిన చిత్తుండవు నాకంటె మూర్ఖంబున బ్రసిద్ధిగలవాడవు. గావున, ఈరాజు

వెంటబోయి అనేకకపటక్రియావిశేషంబులు బన్ని రేబగలు మార్గమున కష్టబెట్టిక్షణక్షణకోపమున యారాజు జాలిబడ దూలించి గర్జనభర్జనముల నారాజుచే సముపార్జితం బగు ధనము ఖర్చు పెట్టనియ్యక నీవశగతము జేసుకొని యెట్లనైనా నాకుకీర్తిదేరా నక్షత్రకా॥

నక్షత్రకునిమాటలు॥ స్వామీ! మీరు కోరినట్లు జేసెద. సెల వొసంగుము విశ్వామిత్రమునీంద్రా ॥

విశ్వామిత్రునిమాటలు॥ ఒరే హరిశ్చంద్రా! ఈనక్షత్రకుడు నీవెంట వచ్చుచున్నాడు. వీడాకలి కోర్వలేడు. బహుసుకుమారుండు గాన, నడవుల బడలుబడ నియ్యక యరసి మా అప్పు దీర్చుమా రాజేంద్రా॥

రాజుమాటలు॥ మంచిది. మీ ఆజ్ఞ మేరకు నటుల నే జేసెదనుస్వామి॥

విశ్వామిత్రునిమాటలు॥ ఒరే హరిశ్చంద్రా? నా దేశంబులో గల యూళ్ళ వెంట నిన్ను దిరుగ నివ్వను. నీ వెక్కడ ధనము దెచ్చెదవు. ఇంత యేల? నాపుత్రికల వరించితి వేని నీ రాజ్యమంతయు నీకిచ్చెదనురా॥

రాజుమాటలు॥ గాదేయా! పదేపదే యీమాటలచే నామానసంబు నొవ్వ బలికెదరు. నేనంత మూఢుడనుగాను. మీ దేశములో వరవీసమైన యాశించను. దేవబ్రాహ్మణవృత్తులు మీకివ్వలేరుగాన, అట్టి అగ్రహారములలో సంపాదించి మీ బాకిదీర్చి లోకము న కీర్తినిల్పెదనుస్వామి॥

విశ్వామిత్రునిమాటలు॥ హా! ఈభూపాలుండు నే నన్ని మాయలు బన్నినా నామాయకు లోబడడు. ఇంతధన మెక్కడ దెచ్చునో నేనాతని వెంటనంటి యనేక కష్టముల బెట్టెదగాక. ఒరే సత్యకీర్తి! నేవచ్చువరకు రాజ్యభారంబు దీర్పుమా మంత్రిశేఖరా॥

మంత్రిమాటలు॥ మంచిదిస్వామి॥

రాజుమాటలు॥ చంద్రమతీ! పూర్వజన్మకృతంబు బోవనిచ్చునే తలోదరీ॥

రాజు చంద్రమతి సంవాదము.

హిందుస్థాని భైరవి - రూపకము.

మానినీయంతమె సమాయబూడవె-కానలోన నీకు నెంతకష్టము వాటిల్లెనాహా॥ మానినీ॥

చంద్రమతి॥ పూర్వసంచితము గడచిపోవనిచ్చునే - సార్వభౌమ యడవి నెట్లు సంచరింతునో హా॥ పూర్వ॥

రాజు॥ మేఁకీడు దెలిసివిశ్వామిత్రమౌనితో- గోలపోతి రాజ్య మెల్ల కునలతామాక్షిరో! మానినీ॥

చంద్రమతి॥ ఐనపనులదలచినగవనా నెయ్యింకను - దీనుడవై మౌని ఋణముదీర్చె దెట్టులాహా॥ పూర్వ॥

రాజు॥ మందగమనయుడవిగడచి కొండుబోదము -- ముందు వెనుకను తోచదాయె డెండమునకుహా॥ మానినీ॥

చంద్రమతి॥ ధీరమతులమీరు బెడదూరినిలయుని - భూరికరుణకలిగి దగవు బొందు టెట్లుహా॥ పూర్వ॥

రాజు॥ తోయజాక్షి వినవె శ్రీబెడదూరునిలయుడు- బాయకమన కష్టదశలుబాయజేసుహా॥ మాని॥——సీ॥ దుర్నివారోర్మిబంధురదుఃఖజల రాశిముంచె నేననుపూర్వసంచితము విధిబలాత్కృతి జేసి వేటాటకు దెచ్చి కలచె నే నాదెనగౌరవంబుచండాలకన్నియలండ జేరిచగొట్టజేసె నే నాక్రోధ చేష్టితంబు! మదికోపశార్దూలముచకు నాబుద్ధిరూక లేదిభయమునగాడు బడియె । సప్తసాగర వేష్టితక్ష్మాతలంబు । పాలనము జేసె నేమతిభ్రష్టునైతి । నింకనాసత్యసంపదల్వంకగలప । దలచుగాధేయముని మాయ దాటవశమె॥ చ॥ అతివరో పూర్వజన్మకృతమంత భుజింపకపోవచ్చునే । కృతకపుమౌని మాయలకుగీడ్పడగకీగవానాబ్ధిపింతనే। గతిగడనీదిసంపదలగాంచినుఖింపగ నెన్నడౌపుహా।గతజలసేతుబంధనముగాదెవిచారము జేయు టెంతయున్॥ మాటలు॥ ఓచంద్రమతీ! చూచితే, నచ్చెడు పూర్వజన్మకర్మ ఫలంబనుభ వింపక పోవచ్చునే పడతీ ! నీయడవి నడచెడు కొదుకు యెండలు చూచి నాయునకు నెట్టులార్చుకొందు, కందులేని చందురునందమునునిండజేయు మోము బడలువడ నావెంబడి వచ్చెడి నిన్నుజూచి దుఃఖ మెట్లడందు కొందునయ్యో! నవఖండభూమండలంబు నేలియుకడకు నేమతిభ్రష్టునైతి. పూర్వసంచితముచేత శోకసముద్రమున మునింగి అకటా! కష్టపాటు లిట్టివి యని యెరుంగకుండిన నన్నుగాదేయుండుబాధింప నతని కేదేమి ద్రోహము చేసితినో. ఇంతకు చింతింపవల దిమ్మునీంద్రు డింకముందే గతి గావించునో గదా ప్రాణనాయకీ॥

చంద్రమతిసీ॥ భూపాలకావిను మాపత్సయోరాశిగడువనీదమునుధైర్య గరిమనావ । అగతాంపహో మదనాగసంతతులకు శమదమ్యయము కేసరి యుగంబు । విమయక్రియాతమోవిదళంబునకు వైరాగ్యమువలన సూర్య

ప్రభవంబు। ఈమణత్రియజకోపాగ్నులార్పనుసత్యప్రవదము మహాజలధరం బుగా నెరుంగవె యోధరాకాంతనీవు। పామరునిచుట్లుజింకొంప బాడియగు నె।కోదుపదలపకజజీసిగగోలుపడక।యశముగోరందమగునహార్నిశముమ దిని॥మాటలు॥ ధారుణీశ్వరాదుఃఖసాగరంబునుగడచుటకనివార్యధైర్యం బును మోడగా దలంపు. మనకు ముందు రాబోయె డీపాపసమూ హంబు లనెడి సేనునగుంపులకు శమదమంబులు సింగంబులుగ నంతరం గంబున జింతింపుము. మోహాంధకారంబును దూరముగ ద్రోయుటకు వైరాగ్యము దినకర్మిగా నెరుంగుము. తాపత్రయం బనెడి దావాగ్నిని చల్లార్చుటకు సత్యంబనుమేఘమును మానసమున గీలుగొల్పుమూధాత్రీ శ్వరా! నీవు పామరమునుపోకార్చి కాల దేశ పాత్రముల చిత్రగించికోదువ దలంపక సుఖంబుగోరక కీర్తిబొందుముస్వామి॥

లోహితాస్యుని ద్విపద-మారువ.

ఓతల్లి విన వెయ్యుల్లములోన - భీతిజనించెనుబిరబిరనీవు - నడచెద వయ్యోసేనడువంగజాల-నడుగులతోడిబడెనాలుకయెండె పులులు జింకలు నెత్తిపోతులిత్రోవ- బలుకరాజెలిడుచు ఈ బారుచున్నవియుఎంతపాపి వేనేను యేడ్చుచునుండ-సుతైననాదిక్కు జూడవేమమ్మ నన్నెత్తుకొన వెయోసలి నా తాక్షి-నన్ను గాబెడుదూరుపద్మాక్షుతోడె॥

చంద్రమతిని లోహితాస్యుడు యెత్తుకొమ్మని చెప్పుట.

దరువు-జంఝూటి రాగము-ఆదితాళము.

అడుగులనెత్తురులడరెనుజననీ-నడువగలేదయ్యో- కడుపులోచేయి బెట్టికలచినరీతిగగడుసంకటమాయె॥ అడు॥ కనుగొననాకలి గలిగెనునిజ ముగనిలబడవేతల్లి-చలమూశాయగనుజను సేనామది నలసటవాటిలె అడు కన్నులనీరునుగారునుచూడవెకన్నతల్లిగావె-పన్నుగ బెడుదూరు వెన్నుని సాక్షిగనన్నెత్తుకపోవె ॥అడు॥ —మాటలు జననీ! నీవెంట నడవిలో నడువజాల, నడుగులుతోడిబడె నాలుకయెండె, మదగజవ్యాఘ్రసింహాం బుల జూచి నామది బెదరుచున్నది. ఆకలి దప్పిచే నలసితిగాన. నిలబడి నన్నెత్తుకొనిపోవమ్మ తల్లీ॥

చంద్రమతిమాటలు॥ రారాకుమారా! యెంతబడలితివిరా! ఆకలి దప్పిగలిగె, నేనెత్తుకొనిపోదరారా॥

చంద్రమతి ద్విపద-ముఖారి.

ఓరాజశేఖర హరిశ్చంద్ర-క్రూరకౌశికుడిట్టి కుచ్ఛితము జేసె-దిన

మణికిరణసందీప్తమౌక్తిక-ఘనతరూపముసుకల్పించిమించి- ఏరులబావుల నెలమివంకలను- నీరెలనించించినిర్దయుండగుచు - బలుదప్పిబుట్టించి బాధ గావించి-కలయంగనాకలిగల్పించిపండ్లు దిసచేదుగావించి దేర్ఘదోషంబు- మానమునగడుబెంచిమాలపెనింత-చలపట్టిబాధ రేజననాథతిలక కలిగనే నీకిట్టికష్టవర్తనము-తొల్లి జేసియట్టిదుష్కర్మఫలము- చెల్లకబోవునేనై చేతి క్రోవ-భూచక్రమేలినపుణ్యాత్మయిట్టి-నీచత్వమునకెట్లునిర్వహించె దవు - ధరణిలో నేనెంత దౌర్భాగ్యవతినో - గురుతరాటవిలోనగూడి వర్తింప-పౌడగానవలసెనే పుణ్యాత్మ యిపుడు-బెడుదూరువాసుని పెంపు లేదాయె॥

దరువు-అట-తోడి.

ఆహావిధిమిమ్మరసియిటుదెచ్చెనే- మోహావేశముయింతమోసము వచ్చెనే॥ఆహా॥ కడకునీకీగతికలిగెనేభూపతి-కడుమోసపోతి కడతేరు రీతి॥ఆహా॥సారెకుమిముజేరి సత్యసంచారి - ధర శ్రీబెడుదూరుశౌరి క్రో చునెనేగోరి॥ఆహా॥—మాటలు॥ప్రాణేశ్వరా! ఈక్రూరకౌశికుండుమిమ్ము బహువిధంబు లగు కష్టంబులబెట్టుచు బాధింతు నని యున్నవాడు. మీ రింక ధైర్యంబు నేమరక సత్యము మరువకయుండుస్వామి॥

రాజు ద్విపద-ముఖారి.

ఓచంద్రమతిననుమోపుణ్యసాధ్వి - ఈచందముననీవుయారామముల్ దూరిక్రొమ్ముడివీడంగగుచములల్లాడతమ్మి రేకులనుబోదరుముకఱగవల జలధారతోముఖచంద్రబింబంబు-కలనొనజికురముల్గప్పియాడగను- కంది నముఖముతో కాంతరోనీవు-నందనునెత్తుకనడచివచ్చెదవు - రమణీయ్య మందిరా రామసీమలనువిమలాంగిచెలులతో విహరింపనీనికోమల దేహవు గోలవుచేల- వేమొయిమెలగెదవిచ్చోటనబల!- పడతినీకిమ్మావిబగిలిపాద ములుబుడబుడనెత్తురుల్బ్బడమెచేడకట -కడుపాపమునినాదుకతమునీకు! దలచినమేలగు ధవళాయతాక్షి॥

దరువు-రూపకము.

బాలామణిచింతిల్లెద-వేలాయీవేళజాల॥బా॥ కాలగతులుగడుప నెవరు-జాలరుసుగుణాలవాల॥బా॥కౌశికముని కారణమున- గాసిల్లి తిమని మనమునన-నోశశిముఖమదిసుఖమును-యాశింపకు భాసురముగ॥బా॥ కన కాంగిరో బెడుదూరికనకాంబరుగృపమీరి- ఘనతరసత్యముగోరిగాంచెదు సుఖమునునారీ॥బా॥—మాటలు॥ కాంతా! ఈదురంత కాంతారమున

సంతాపభరము కలిగెనని చింతింపకుమింతీ! బెడుదూరుపురవరాధీశ్వరు మదినిడుకొనిన మనకు కడుసుఖంబు కల్గును. కొడుకు నెత్తుకొని నడువఁజాల వింతతడవయ్యె. నీవాడవిగడచిపోవలె తనయు నే నెత్తుకొనివచ్చెద నీవు త్వరితంబుగ రమ్ము కోమలీ॥

చంద్రమతిమాటలు॥ అట్లనే శీఘ్రంబుగ నొక్కపురంబు జేరంబోదము॥

నక్షత్రకుని దరువు – అట–ముఖారి.

అడుగిడజాలనయ్య–రాజేంద్రనే ॥నడు॥ యొడలికిబడలికలడరేచిరు చెమ్మట–బోడమెనియ్యడవిలో నడచిరాజాలను॥ అ॥ దేహమునొచ్చెను దాహముబుట్టెను–యోహో హరిశ్చంద్రయాహింపనీవేళ ॥న॥ ఇలనుశ్రీ బెడుదూరునిలయునిసాక్షిగ–నలసటజనియించె నలినాప్తకులనాథ ॥అ॥—

మాటలు॥ హరిశ్చంద్రభూపాలా! నాపాదంబులు పగిలి చిల్లునరక్తంబు వెళ్లుచున్నది. తెల్లముగనొక్కయడుగైనబెట్టి నడువఁజాలనయ్యా. నన్నొకమానిసీడకీడ్చి ప్రాణరక్షముచేయ నీకిష్టమగు నేనినెక్కడనైననుదకము దెచ్చి కండంబున కుందుమాన్పుము రాజేంద్రా॥

రాజు దరువు – హిందుస్తాని – అట.

కోమలాంగిరో మునికుమారుడు కూలబడియెనుచూచితే – యేమి చేయగవచ్చుమనకిపుడెంతకష్టముగల్గెనే॥కో॥ ప్రొద్దుకుంకగపోయెమనపై పద్దుచేసీయడవిలో–ముద్దియాయీమునికుమారుడుమూర్ఛనొందెనునడువడే కో॥అతివరో యీయడవిలోమునిసుతుడు బడలికచేతను – క్షితితలంబున బడియెనింకేగతులు కల్గునోకోమలీ॥ కో॥ నీరజాక్షిరో దప్పిదీరగ నీళ్లునెక్కడిదెత్తునే– దారితెలియగలేదు శ్రీబెడుదూరినిలయుని సాక్షిగా॥ కో॥

మాటలు॥ ఓచంద్రమతీ! ఈనక్షత్రకుడుబడలువడియేచూడితే. ఇక్కాననగడచి యొక్కపల్లెచేరబోదమనిన విఘ్నమయ్యెగదా. ఇమ్మునికుమారుండు మూరెడుమేర నడువఁజాలడు చతికిలబడి కదలక మెదల కున్నవాడు, ఇతనిమార్గాయాసం బెట్లుతీరునయ్యో ఇయ్యడవిలో నీళ్ళెక్కడదెత్తు, కౌశికుం డితని నాపై బరాతం బేలపంపె ఇంక నేప్రమాదము కల్గునో, విధికృతం బెట్లున్నదోగదా॥ తలోదరీ॥

చంద్రమతి దరువు–ముఖారి–ఆది.

మనుజేశయికమోసమాయ– మునినూనుడిటులనుసేయా॥మ॥ కడలకనూర్చ్వానికపటముగైకొని యుదకము దెమ్మనె దేవా॥మ॥ జలమెన్యామెనది తెలిసియు నెమ్మది–చలమును జేసెనీవేళ॥మ॥ జగతిని బెడుదూరుజలజా

త్కుడు లేడే-వగచిన ధీరునెనాథా ॥మను॥——మాటలు॥ ప్రాణకాంతా! ఇమ్మునికుమారుండు లేనిపోనిబడలిక దెచ్చుకొని నేలఁబడియె, ఇంకనదువఁ ప్రొద్దు లేదు, ఈయడవిలో నక్షత్రకుండు బడిన మనకు మోసంబువచ్చును. కుమారుఁడించి ఈనక్షత్రకుని మానినీడకు దెచ్చి దప్పిదీర్పుము, శీతోపచారంబులఁ జేసి రక్షింపుమా రాజేంద్రా॥

రాజుమాటలు॥ ఓచంద్రమతీ! ఇక్కడ మనపుణ్యవశంబున నొక్క తపసికనుపడియె ఇమ్మునివరుండుమనవశిష్టునిబోలినట్లున్నవాడు. యితం డౌనోకాదో నేనుబోయి యితనినడిగి నీటికందువదెలుసుకొని జలంబులు దెచ్చెదనే కాంతా॥

చంద్రమతిమాటలు॥ త్వరితమ్ముగ రమ్ము ప్రాణేశ్వరా॥

రాజు దరువు – అటతాళము – పీలురాగము.

తాపసోత్తమనన్నుదయజూచిబ్రోవనే– నాపుణ్యవశముననీప్రాపుగనుగొంటి ॥తా॥ సదయుడవై నాతోయుదకమున్న చోటు–విగితంబుగజెప్పి బెదరుమాన్పుమువో॥తా॥ ఘోరాటవిలోనపేరెండకోర్చి – నోరెండధృతి దూలెనొచ్చెబ్రాణములు ॥తా॥ కోరికబెడుదూరుశౌరిసాక్షిగనిన్ను–జేరితి నాదప్పిదీరగజేయవె ॥తా॥——మాటలు॥ పదివేలవందనంబులు మునీంద్ర॥

కపటమునిమాటలు॥ భూకాంతా! ఈదురంతకాంతారంబున నెంత బడలితివయ్యా, నీవృత్తాంతం బంతదీక్షణంబున మే మెరింగితిమి. నీవు హరిశ్చంద్రుండవుగదా. విశ్వామిత్రునకు వసుధారాజ్యంబు దానమిచ్చి దారాపుత్రాదులతో ఘోరారణ్యంబు జేరవచ్చితివి. యా కౌశికుండు పూర్వమునీవివ్వవలసినయర్థార్థంబునకై నీపై నక్షత్రకునిబరాతంబుబంపె. యాకపటబ్రహ్మచారిదప్పిగొని నడువలేక పుడమిపై బడినసీవునీళ్ళకువచ్చితివి. అతీతానాగతవర్తమానంబులు మాకు దెలుసునయ్యా రాజేంద్రా॥

రాజుమాటలు॥ తాపసోత్తమా! నాపాలిదైవంబు నీవు గాన. నీ రాత్రి మీయాశ్రమంబున విశ్రమించిపోయెద. నేను నీళ్ళుదెచ్చునంతవరకీబ్రహ్మచారి ప్రాణంబులనిల్పునోనిల్పడో, నాకపకీర్తిరాకుండమీకమండలోదకంబుబోసి రక్షింపుము స్వామి॥

కపటమునిమాటలు॥ భూపాలకా! సంగరహితులైన మాయెదుట సంగనాసహితుండవై యుండతగదు. నాకమండలోదకము కొంచెముగావ, వానిదప్పిదీరదు. ఇచటికి కూతపెట్టుదూరంబున నొక్కమడుగున్నది.

దానిచెంగట నొక్కవటవృక్షమున్నది, ఈయడవిలో నదితప్ప మరిరమ్య స్థలంబులేదు. దానిక్రింద విశ్రమించి త్వరితముగ వెళ్ళుమయ్యా।

రాజుమాటలు॥ అట్లనే బోయివచ్చెదను స్వామీ॥ చంద్రమతీ! ఇమ్మునిచెప్పినమార్గంబున నామడుగుబేరక బోదము తలోదరీ॥

చంద్రమతి దరువు–తోడి–అట.

మానవనాథమునిమాటవినబాధమానుదేవో – మానుగమోసము మనకికరాదా॥మా॥ప్రొద్దునుగుంకెబోలగజూచితే – తద్దయునేనికతాళగ జాల॥మా॥ నందనునెత్తుకనడువగాజాలాక్రందుగమదీకినిభారముదోచెను॥ మా॥ సారెకుబేడుదూరిశౌరినిగోరి – వారకదలచినదీరునెకష్టము॥ మా॥ మాటలు! స్వామి ! ఈతపసిజూడ కపటమూ నసుడుగ దోచుచున్నాడు. కౌశికుని యనుమతంబున విపులాటవుల మనల నపరిమితకష్టంబులబెట్ట ముసుగరిష్టుని యాకృతిదాల్చిన చపలమతిగాబోలు. బంధురంబగు నంధ కారంబున నితనుచెప్పిన మార్గంబునబోవ నవర్గళంబులగు దుర్గంబులెన్ని గలవో వాటినిగడచిపోయి యాకోలను సమీపంబున నుండెడిమఱ్ఱిచెట్టు సమీపంబున పవళించిన మన కేమిప్రమాదంబు గల్గునోగదా స్వామి –

రాజుమాటలు॥ కాంతాశిరోమణీ! ఈతాపసోత్తముడు మనకాపదకునే ఇతరంబు జింతింపకనితడుచెప్పిన మార్గంబునత్వరితంబున నరుణ కిరణుండు చరమగిరికరుగకమునుపె ఈగురుతరాటవి గడచిపోయెదముర మ్యాంబరమణీ! నీవరతనూజునే నెత్తుకొనివచ్చెదచిత్తంబునద త్తరపాటుజొత్తిల్లనియ్యకు విధికృతంబునకుపగచుటబుధజనమతంబుగాదేపింధుముఖీ॥

చంద్రమతి మాటలు॥అయితే అట్లనేపోతాముపదండి స్వామి॥

సూర్యాస్తమాన వర్ణనము.

రాజు–చ॥తనకులమందుబుట్టి వసుధాస్థలి మానికొసంగిదీనతన్। దనయునితోగళత్రసహితంబుగ సత్యముబూని ఘోరకా।వనమునసంచ రించునరనాథునిజూడగలేక పశ్చిమాం। బురిధిమునింగెనో యనగభోరన భాస్కరుడ స్తమించినన్——సీ॥ విష్ణుపాదాకీర్ణ వినసితమంజీర ఘటితఖర్జూరంపుఘంటలనగ।నాకాశజలధిమధ్యాక్రాంతవిస్ఫుర త్ఫారీనశాబకిపంక్తు లనగ । గగనలక్ష్మీదివ్యకర్ణావతంససంకలితపేశలవజ్రకలికలనగ । విమల సంధ్యాంగనారమణీయ్యకబరిపై కుందకుట్మలంబులగుంపులనగ । సిరితనూజునిపట్టాభిషేకవేళ । సారకాముని లాకాశ సౌధవీధి। ముగ్గు లొాగిదీర్చు ముత్యాలపిగ్గులనగ । నభ్రమండలమునదారక లతిశయిల్లె॥—మాటలు

ఓచంద్రమతీ !చూచితే. ఇవ్విధంబున నస్తమానంబైనపిమ్మట నాకాశం
బున చుక్కలు గనుపట్టెబంధురంబగు నంధకారంబుదిశల నావరించె.
గాన,నండిను భుజ బు దిడుకొని నక్షత్రకుని వీపునగట్టుకొని నీకేలు
పట్టుకొని నిజభుజాదండమండిత మండలాగ్ర ప్రభా విదళితాంధకారుం
డనై నడచి యమ్ముని చెప్పినమార్గంబున మడుగుజేరబోదము పడతీ॥

చంద్రమతిమాటలు॥ అట్లనే పోదాము పదండి స్వామి॥

రాజుమాటలు॥ చంద్రమతీ! చూచితే, యమ్మునిచెప్పినప్రకారం
బుననిచ్చట మడుగుగంటి వే, ఈనిర్మలోదకంబుల దప్పిదీర్చుకొనుము. నే
నిత్యకృత్యంబుల దీర్చుకొనియెద.ముందు ఈనక్షత్రకుని బడలికదీర నుప
చారంబుజేసి మృదులతృణశయ్యగావించిశయనింపజేసె. నీవు నీకొడు
కుతోగూంతదవ్వునబరుండుము నేఖడ్గధరుండనై గాచుకొనియెదవేకోమలీ

చంద్రమతిమాటలు॥ అట్లనే పవళించెదము స్వామి!

బేతాళుని దరువు—నాట—రూపకము.

భూతాట్టహాసుడై భేతాళుడవచ్చె- భూతలాధీపుజేర భూతలంబ
ద్రవ॥భూ॥నీలమేఘాకారుడై లీలదన కేలశూలంబుబట్టియాభీలుడై యపుడు
భూ॥ తలలహారముదనదుగళముననుధరియించి — ఫెళఫెళధ్వనులతో బేరు
బాడుచును॥భూ॥చరణఘట్టనలతో ధరణివణకగవచ్చె — యరుదుగాబెడ
దూరుహరిదాసుజేరా॥ భూ॥ మాటలు॥ ఒరేమానవాధమా! మదీయ
శాకినీ ఢాకినీ భూతగణంబుల ముక్కుల బెక్కితి వికనెక్కడబోయెదవు,
నాచే జిక్కితివి. నీకు దిక్కెవ్వరు ఒక్కమానవా! హరిహరాదులు నా
దిక్కునిక్కిజూడలేరు. ప్రళయసమయజలధరనిష్ఠ్యూతనిష్ఠురనిర్ఘాతసమా
నంబగు మదీయ్యసింహనాదంబుచేసకలలోకపాలకులు చికాకుబడుదురు.
నీకేకరణి నిలువబడగు. వంటయిల్లు జేరిన కుందేటిచందంబున నావట
వృక్షంబుజేరితివి. నీయెదబగిలించికొత్తనెత్తురుపానంబుజేసెదచూడరా॥

రాజుమాటలు॥ఒరే ! నన్ను సామాన్యమానవునిగాదలంచెదవు.
భీమాట్టహాసంబుగ సంగ్రామంబుసేయబవచ్చెదవా,నిలునిలు. మస్తమిత
సమస్తవిరోధివరోధినిజాలంబగునాదుకరవాలంబుచే నీకంఠంబుద్రుంచి
లోకంబుల బాధమాన్పెద జూటరా భేతాళా॥

భేతాళునిమాటలు॥ ఒరేమానవాధమా! నాయెదుట ప్రొవ్వ
బాజెదవు, నీవెవ్వదవురా. పులియున్నపొదరిల్లుజేరిన జింకరీతిగ మదీ

యాశ్రమంబు జేరితివి. నిన్నిప్పుడు కప్పను మ్రింగుక్రూరసర్పంబురీతిగ నప్పళించి మ్రింగెద జూడరా॥

రాజుమాటలు॥ ఒరే భేతాళా! నీ వెక్కడ. నే నెక్కడ నను తార తమ్యజ్ఞానంబు లేకనుదగ్రవిగ్రహంబుజూపవచ్చెదవా. నిలునిలు. మద్భుజా దండ మండిత మండలాగ్రంబున నిన్ను ఖండించి దండధరు నిలయమం దుండ జేసెద జూడరా॥




భేతాళ హరిశ్చంద్రుల సంవాదము.

దరువు - జంఝూటి - ఆది.

మానవాధమా నాతోనబోరుమా - ఘనబలనిధానుడనిన బోవ నిత్తునే॥ మా॥

రాజు॥ వద్దువద్దురాయీపద్దు లేలరా - యుద్ధశిగను హద్దుమీరరద్దు చేయకు॥ వద్దు॥

భేతా॥ రమ్మురమ్మునీకరమ్ముజూతము-రొమ్ముజించిరక్తము పాన మ్ముజేతురా॥ మాన॥

రాజు॥ భండనంబున నుద్దండముగను నీ-గుండియలనుజించి నేల గూల్తుజూడరా॥ వద్దు॥

భేతా॥ యాలపక్కెదురణకేళిసల్పుమా - భీలముగను శూలమున ను గూలవైతురా॥ మాన॥

రాజు॥ ఓరిబెడుదూరిశౌరిసాక్షిగా - క్రూరనిన్నుగిట్టి యముని జేర బుచ్చెద॥వద్దు॥—మాటలు॥ ఒరేజగద్ద్రోహీ! విను. ప్రణయకాళవహ్నిభు క్కీలాభీలంబగుమదీయ్యకరభాలంబుచేనాలంబునఫాలనయనుండుగాచినా

నిన్ను నేఁ గూల్పక పోనియ్యను. చండితనంబుచే గండుమీరి రాకురా, మండిత భూమండలాధీశ్వరు శిర । కాండ మాలాలంకృతుండైన నీగుండి యలు బగులించి నీ కండల సంక గృధ్రంబుల గబళింపజేసెద ఇంచుక సేపు సైరింపరా భేతాళా॥

భేతాళుని మాటలు॥ ఒరే మానవాధమా! నన్ను గెలిచె ననుకన్న మిన్ను గానక పలికెదవా. నిలు నిలు. ముగ్రలోచన భుజాగ్ర పరికీలితో దగ్రశూలంబునకు సమంబయినమానబలనిధాన మానవప్రాణానిలాహార క్రూరవ్యాళప్రాయంబగు మదీయ్యశూలంబుచే నిన్ను నేఁగూల్చి కాలుని ప్రోలికనిచెద. నీగుండియలు గడుపునిండ దినియెద. గాన. నీకు బ్రాణం బులపై. యాశ గలదేని. నీసతిసుతుల నాకొప్పగించిపొమ్ము. నిన్నువిడిచె దరా మానవాధమా॥

రాజుమాటలు॥ ఒరే భేతాళా! సంహారసమయ మృత్యువదన గహ్వరాంతరిత జిహ్వోపమానంబగును దీయకృపాణం భీభూరితరభయద రేఖాకారంబగు నీశిరంబును ధారునికి బలిశేయును జూడరా ద్రోహీ॥

(అనిన భేతాళుడు క్రిందబడె.)

సూర్యోదయ వర్ణన.

రాజు—సీ॥ ఇంతిరో పూర్వదిక్కాంతా ప్రసూతికై తెరబట్టు చెంగావి వరదయనగ । గుంకుమపస్పిటగుదురుగా బాలోమిజలకమాడినలసచ్ఛాయ యనగ॥ నుదయపర్వతరాజు విదురించిమేఖ్కృష్ణఘూర్ణితారుణ నేత్రవర్ణ మనగ । జలధిలోపలచుండిపడిసింగి బ్రాకిన బాడబావ్యతాత్ర్యుభయనంగ । మునిజనంబులుగిరికూటముఁ జరింప । వారిజూటాంశువనుశోణవర్ణ మనగ। సకలజనములు దెలివంది సన్నుతింత॥ పూర్వదిశైచ్చలమున గెంపుపొడమె కం బె॥—సీ॥ సురరాజపురినినిస్ఫురితమైగనుపట్టుగోపురో పరి హేమకుంభ మనగ । కొల్లగానుదయాద్రి కల్లి నిలతికకుప్వమాకూశ్మాండఫలమనంగ! పూర్వదిగ్గిరిపై నపూర్వ వేదత్రయీ సారమై తిగుగడియార మనగ । తమ మనుమృగముపై సమయకిరాతుండు గురిగగాల్చినఘిరంగిగుండనంగ।అంబ రీషునితనతపోడాంబికముల । బాధలొనరించుదూర్వాసుపై నవడరు । విక్ర మోజ్వలమగు విష్ణుచక్ర మనగ । భానుమండలముదయాద్రిపై నబొడమె॥ మాటలు॥ చంద్రమతీ! జూచితే. తూర్పుదిక్కు కొండపైన పండినగుమ్మడి పండుపోలిక మార్తాండమండలంబు దోచె. మన ముద యకృత్యంబుదీర్చి పోవ మని తలంచిన భానభోంతరాళంబు నిండ మేఘంబులుబట్టిగర్జార

వంబు నలుదిక్కుల జగ్గిత్తంబుల జేయుచు యురవడిగ మెరుపుతీగలుగను పడ పిడుగులతోటి వడిగలవర్ష ధార లెడ తెగక బుడబుడ బడసాగెపడతీ! ఈయడరున మునికోడుకౌశికబడలిక పడునో. మన మీావనభూమిలో తన యునితో నెట్టియాపద ననుభవింతుమో గదా కనకాంగీ॥

చంద్రమతిమాటలు॥ జగదీశ్వరా! వినుము గణిత సత్యవ్రతుండవై యుండియు దిగులు జెందవచ్చునే. కౌశికుడు మనల గాసి శేయుటకై కల్పించిన యనల్పజలధారలతో గలసివచ్చెడు చలిగాలిచే మీారు చలింపక కొంచము నిరీక్షించిన ఈవర్షము విడిచిపోయినయెడల బోదము ప్రాణనాయకా॥

రాజుమాటలు॥ అట్లనే పోదాము పద వే కోమలీ॥

ఇది శ్రీమ దుభయ వేదాంత ప్రవర్తకుడును, గందాళ్ళవంశ పయః పారావార రాకాసుధాకరుం డగు బెడుదూరు రామాచార్య కవీంద్రునిచే రచియింప బడిన హరిశ్చంద్ర నాటకము నందు మొదటిరాత్రికథ ముగిసెను.



శ్రీ ర స్తు.

బెడుదూరు శ్రీ వేంకటాచల రమణాంకితం బగు.

# హ రి శ్చం ద్ర నా ట క ము.

***

రెండవరాత్రి కథాప్రారంభము.

రాజు ద్విపద-శ్రీరాగము.

శ్రీసూర్యకులజుడాశ్రితరక్షకుండు- భాసురసత్య సౌభాగ్యశీలుండు సరసుడౌయాహరిశ్చంద్రభూవిభుడు- స్థిరముగాజంద్రమతీ దేవిసుతుడునపి తుడౌనక్షత్రకుడు వెంటరాగ విపులాటవులుగడచి వెడలుదమనుచు యుద

యకృత్యంబునినొవ్వగాదీ్చి-కదలిపోవుచునుండఘనతరంబుగను క్రూరకౌశికమునికుచ్ఛితవర -మారూఢమేఘగర్జారవంబెసగగురియుచుగల్పాంతఘోరమారుతము-పారిపారివీచినబాంతినినుతుని - నక్షత్రకునిబానుసరయుచునిశిత-కౌక్షేయకలితుడై కమలాప్తకులుండ-చలిగాలిచేపణకుసంయమీసుతుని-వలపలిభుజము వరణసూజన్మువామలిభుజము నధరియించిసతికినాపదకీర్చుచునదులునదులుకోనల-కానలకొన్నిదుర్గముల- మానుగాగడచియుమ్మనుజవల్లభుడు-చనుచోటబ్రబళయాగ్నిసరయుమీశ్వరుడు- ఘనముగ గల్పింపగాంతనుజూచి-సలలితబెడుదూరుసత్పురాధీశు - దలచుచుపలికెమాధవుడునవ్వేళా॥

రాజు చంద్రమతి సంవాదము.

దరువు-ఆదితాళం-ఆనందభైరవిరాగం.

సారసాక్షిచూడవె యీఘోరాటవినిజుట్టుముట్టి - క్రూరానలముజేరవచ్చె నారీమణిరో॥ సార ॥

చంద్రమతి॥ స్వామిచింతవలదువలదు సామాన్యునివలెనేమీరు-పామరమతితో నిటిబల్కెదరేలా॥ స్వామి॥

రాజు॥కాశీపురము జేరిమనముకౌశికమానీంద్రుఋణము-వాసిమీరదీర్తునని నేనాశించితినే॥ సార॥

చంద్రమతి॥ శౌరి శ్రీబెడుదూరు నేలుశౌరి మిమ్ముకూరిమితో -సాకుబ్రోచుటసత్యమా రాజేంద్రా॥స్వామి॥—మాటలు॥ఓదినకరకులనాథా! ఘనతరంబగు సత్యవ్రతంబు గల్గిన మిమ్మీదవాగ్ని జ్వాలలేమిచేయగజాలును. నెదుపకు గురుతర కరుణారసభరితుండై బెడుదూరుపురపరాధీశ్వరుండు మిమ్ము దరిజేర్పగ గలవాడు స్వామి॥

రాజుమాటలు॥ఓచంద్రమతీ! విను. కాశీపురంబు జేరి కౌశికుని ఋణంబుదీర్చి బాసనిలుపదలంచితినే కాంతా? ఇయ్యడవిచుట్టుముట్టుకొని బ్రహ్మాండకటాక్షంబు నింత మండుచువచ్చెడి నీయగ్ని గడచిపోవ నెట్లగునని చింతించెద నిమ్ముకుమూరున కేమిప్రమాదంబు గల్గునో యకటా॥ మన మీచెట్టులాగ్నిపాలైతిమే బాలికా! నేనీదవాగ్ని జొచ్చెద మదీయప్రాణాహుతులతో సంతసిల్లి ఈయగ్నిభట్టారకుండు మిమ్ము దరిజేర్పగ గలండు తరుణీ॥ సరసీరుహపాణీ॥

చంద్రమతి దరువు - కాంభోజి - రూపకము.

నిన్ను బాసినిమిషమైననిలువజాలభూమిపాల-నన్నుబంపవేనాథనేనిక

పన్నుగానటుబోయివచ్చెద ॥న॥ మానుగా ఈమునికుమారుని మమతతో రక్షించినా - మానవేశ్వరయనయుశంబును సువలబొందకయుండును ॥ని॥ అవనిలో మునియప్పవిర్భళ వనజనేత్రుని బారికి - తవిలిపోవగదగునాకిది భువననాయక పోలునే॥ ని॥ ధారుణీశ్వరవినుము శ్రీబెడుదూరుమందిరు సాక్షిగ-మీరుపోవగవలదుమీపదవారిజములకుమ్రొక్కెదా॥ నిన్ను॥— మాటలు॥ ప్రాణేశ్వరా! నిన్ను బాసి నేనిమిషమాత్రంబైన నిలువజాల. గాన. సన్నిదవాగ్ని కర్పించి మీపుత్రకుని ఈనతిత్రకుని రక్షించుకొని విశ్వామిత్రుఋణము దీర్చి మిత్రకులంబు పవిత్రంబు చేయుము. ఇందుకు మీరేమి సందేహింపవలదు. తడవుచేయక నాకానతివ్వుము స్వామి॥

రాజుమాటలు॥ తరుణీ! ఈఘోరాగ్ని బారికి నిన్నేరీతి బంపువాడ నేనికతంబున నీకఖిలసుఖంబులు గల్గుచుండును. నీయట్టిసుగుణశీల నీ దవాగ్నిజ్వాలికాజాలంబులపాలుచేయ జాలుదునేతలోదరీ! హా! విధికృతంబిటులాయె నేనేమిచేయుదు నాకేమిదిక్కుదోచ లేదుగదా ప్రాణనాయకీ॥

చంద్రమతిమాటలు॥ భూమండలాధీశ్వరా! మీరికనొండు భావలాడకనాకునానతివ్వుము ఇదేపడివేలువందనంబులు. ఘోరాగ్నినుఱకబోయి వచ్చెద. నన్ను మరచినను సత్యవాక్యంబును మఱువకుండుము స్వామి॥

చంద్రమతి లోహితాస్యుల సంవాదము.

దరువు - బేహాగ్ రాగము - అట.

లోహితాస్యుడు! నేనువచ్చెద నన్నెత్తుకోవమ్మా - మానుగనిను బాయలేనె మాయమ్మ ॥నేను॥

చంద్రమతి॥ నన్నుగన్నతండ్రిరో నాముద్దులయ్యా-ఘనముగమీయయ్యకడనుండుమయ్యా ॥నను॥

లోహితాస్యుడు॥ అమ్మయిదియేమిమాయయ్యనువిడిచి-ఇమ్ముగనెక్కడికేగెదా నడచీ ॥నేను॥

చంద్రమతి॥హా! లోహితాస్య హాహాసుకుమార - కాలాగ్నివార్చి నీకడకువచ్చెదరా ॥నేను॥

లోహితాస్యుడు॥ తల్లి శ్రీబెడుదూరుధవునిసాక్షిగను- కల్లసేయక నీవు మళ్ళీరావలెను ॥నేను॥

చంద్రమతి॥ నాయన్న బెడుదూరునాధునితోడు - పాయకవగ్నిలో బడివత్తుచూడు ॥నను॥—మాటలు॥ కుమారా! ఈఘోరాగ్ని జేరజని

బెడుదూరుపురవరాధీశ్వర కరుణాకరఝరీకలితనై మరల నీకడకువచ్చెద నేవచ్చునంతవరకు మీయయ్య చెంతనుండు మోతండ్రీ॥

లోహితాస్యునిమాటలు॥ తల్లీ! నన్ను విడిచి పోవ నీకు కాళ్ళెటులాడునమ్మా! నీవెన్ని చెప్పిన నన్నెడబాయజాల. నీవెంటవచ్చిదూరమున నుండి చూచుచుండెదగాని నన్నెత్తుకొనిపోవమ్మా॥

చంద్రమతిమాటలు॥ బాలా! ఈదావాగ్ని కీలంబుల వేడిమికినోర్వజాలవు నాయన్నా! నామాట వినుము నీయగ్ని చల్లార్చి త్వరితముగ వచ్చెద. చింతసేయకురా తండ్రీ॥

లోహితాస్యునిమాటలు॥ అయితే త్వరితంబుగ బోయిరావమ్మతల్లీ!

చంద్రమతి ద్విపద – కాంభోజి.

ఈరీతిభీతమృగేక్షణయంత – సూరిమితోగన్నకొడుకునూరార్చి – హృదయేశుపదములుహృదయమధ్యమున–గదియంగ జేర్చియాకాంతాలలామ–ఘోరదవాగ్నిగన్గొనకేలుమొగిచి – ధీరయైచంద్రమతీదేవిబలికె – నవనాబ్జనేత్రయోసంయమిస్తోత్ర–భువనత్రయాధారపుణ్యావిహార – కలుషాద్రిశతధారచండలిగంభీర – ఫలితవిక్రమధామబలనై రిభీమఘులమనోవాక్కాయకర్మంబులందు – జననాథుడౌహరిశ్చంద్రభూపతికి–దప్పనిశీలంబు దలచితినేని–యెప్పుడుపతిభక్తినెనయుదునేని–నాపతినూనృతనయశీలుడేని ప్రావుగానేపతివ్రతధర్మనిరతి – బూనితినేనియోపుణ్యభూతివంద్య–మానికుమారుని మానుగబ్రతుక – జేసి పిమ్మటనునిజేశుండుతనదు బాసదప్పక మునిపతియప్పుదీర్ప–సుతునితోబ్రతుకంగజూడుసంప్రీతి.సతముగావిప్పుడు సదయుండవగుము – అనిపల్కిసంచభూతాళిసాక్షిగను – తనుమధ్యబెడు



చంద్రమతి దావాగ్నిజ్వాలలయందు బ్రవేశించుట.

దూరుదనుజమర్దనుని దలచుచునప్పుడుతడవుచేయకను - చెలువుగానగ్నికి చేతులు మొగిచి॥

దరువు - జంఝూటి - అట.

కరుణింపుమావీతిహోత్ర-నన్ను॥కరు॥ పరమపవిత్రమోదవమాన మిత్ర॥కరు॥పతిభక్తియేసత్ప్రవ్రతమనుకొని - సతతముగనెప్పుడుసలుపుదునే ని॥కరు॥ హుతవహాయీమునిసుతునినక్షత్రకుని-కృతపుణ్యశాలివై బ్రతు కంగజేసి ॥కరు॥ యాగభోక్తరామయార్యసత్కవివర-భాగదేయమోనా గకంకణనేత్ర ॥కరు॥ దురితార్తిహర బెడుదూరుపురీశ్వర-వరదవై శ్వానర శరణుజేసెదను ॥కను॥—మాటలు॥ అగ్నిభట్టారకా! నేపతివ్రతనైతినేని ఈనక్షత్రకుని ముందుగా బ్రతికించి పిమ్మట మమ్ము రక్షించుడు లేదేని నీరుచేయుము స్వామి॥

అగ్ని చల్లార్చుట.

చంద్రమతిమాటలు॥ కుమారా! మనపుణ్యవశంబున నీఘోరాగ్ని చల్లారె నింక నిన్నెత్తుకొనియెదరారా॥

లోహితాస్యునిమాటలు॥ జననీ! యెంతనేపుపోయితివమ్మా. ఇది వరకుమాయమ్మనుచూపింతురమ్మనిమాయయ్యనుబాధించుచుంటినేతల్లి

చంద్రమతిమాటలు॥ పదివేలువందనంబులు ప్రాణేశ్వరా॥

రాజుమాటలు॥ దీర్ఘసుమంగలీభవ హేకాంతా! నీపతివ్రతాశీలం బుచే నాభీల దవజ్వాలంబు లడంగె. ధాత్రిలో నీసద్వృత్తంబు ప్రస్తుతి కెక్కె, నాకపకీర్తిరాకుండ ఈనక్షత్రకునిరక్షించితివి. ఇంకనెల్లశుభంబు గల్గునే పల్లవాధరీ! నీకారణంబున మునిశంకరుని ఋణంబుదీర్చెద. మన మింక కాశీపురంబు జేరఁబోదము వారిజాక్షి॥

చంద్రమతిమాటలు॥ ఇట్లనే పోదాము పదండీ స్వామి॥

నక్షత్రకుని దరువు - ఆట సురట.

బొంకింపలేనైతినే-రాజేంద్రునిబొంకింపలేనైతినే॥పంకజముఖియీ భూమిమహిమచేత- పొంకముగనెన్నిపోకలుబోయిన ॥బొం॥ కాలానలం బునుబోలినయీయగ్ని - కిలనుచల్లార్చె బాలశిరోమణి ॥బొం॥ సాంద్రపతి వ్రతచంద్రమతియన-కింద్రుకడబంతమేలబల్కెనోమాని ॥బొం॥ బాపురె బెడుదూరుశ్రీపతిసాక్షిగ - భూపాలునకుయేయాపదగల్గదు ॥బొంకిం॥— మాటలు॥ హాదైవమా! ఈచంద్రమతీ ప్రభావంబున దావాగ్ని చల్లారె

ఈపతివ్రతామాహాత్మ్యంబున నిమ్మహీపాలుండచలుండై యున్నవాఁడు. నేనింకేమిచేయుదు హరిహరీ! విశ్వామిత్రుఁడు పురంజయునికడ నరుంధతీరమణునితో బందెమేలబల్కె తనశిష్యులలో నన్ను మేలువానిగా వించె. వతనికి ప్రత్యుపకారంబు చేయుట కేమియుపాయంబుచేసిననీచంద్రమతీ ప్రభావంబున వ్యర్థంబయ్యె నింక నాదురబోధచే నేనేర్చినకపటోపాయంబున నీదంపతుల నెడబాపు యెట్లులనైన బొంకించెదగాక॥

దరువు - కేదారగౌళ - అట.

మానినీమణిచంద్రమతినీమహిమచేత - నేనుబ్రతికితినిజముగావినుమానుగానొకమాటదెల్పెద॥మా॥ కుతలమునభారతి ధరాధరసుతయరుంధతిరతియులక్ష్మి-సతియునీకును బ్రతియెపాతివ్రతశుభాన్విత చరితగావున॥ మా॥ ధరణిలోబెడుదూరునత్పురనరునికరుణతో సురుతరాగ్నిని - పరగనార్చితిగానధరణీసరియనఁదగుసాధ్విగల్గునె॥మా॥—మాటలు॥ చంద్రమతీ! ఈయాభీల వనజ్వాలికా జాలంబుల జల్లార్చి నన్ను బ్రతికించితివి, గావున, నీపాతివ్రత్యమహిమ కేనుసంతసించితినమ్మా! నేనీకు బ్రత్యుపకారంబుసేయఁదలంచి చెప్పెద ననుమానింపక వినవమ్మవనజలోచన॥

చంద్రమతిమాటలు॥ అదియేమోసెలవొసంగుము నక్షత్రకార్య॥

నక్షత్రకుని-కందార్థం! వనితా నామాటలు। వినుమ్మనగాదలపవలదు వేగమ। నావెంటనయోధ్యాపురమునకును । ఘనముగ బోదాము రమ్ము।కనకాంగినేఁడు । నమ్ముము నే జెప్పిన మాటజూడు । వినయమతినై కౌశికుని నే వేఁడుకొని రాజ్యంబునీపర తనయునకుబట్టంబుగట్టెదననుమతియు వనజలోచన । కనకాంగినేఁడు।—మాటలు॥ ఓచంద్రమతీ! నామాట లబ్ధంబుగా దలంపక నయోధ్యాపురంబునకు బోదామురమ్మా. ఈహరిశ్చంద్రుని వెంట కంటకారణ్యంబులు దిరిగితి వేని, బహుబ్రయాస పడెదవు సుమీ! పురజత్వాల నేత్రానలతుల్యంబగు కౌశికుని కోపాగ్ని కెట్టులోర్చెదరు, ధనమెక్కడ దెచ్చెదరు. ఇప్పటికి పది దినంబులుగడువున్నది. నీపతిచేత నొక్కకాసైన లేదుగదా. విశ్వామిత్రుండు వచ్చి ధనము దెమ్మని బాధచేనేని నీపతి బొంకవెరచి నిన్నెవ్వరికైన తెగనమ్మగలండుగాబట్టి నామాట విని పోదామురానమ్మ తల్లి॥

చంద్రమతి-కందార్థము॥హరిహరియిటుబలికెదవిపా। పరసౌఖ్యంబులకు నెల్ల బతియెధనంబుగా దరుణులకని చెప్పరె। బుధ వరు లెప్పుడువినగ

లేదె । వరమానితనయా । నీమాటవినతరముగాదయ్యా॥ ధరణిలో పతి వెంట నెప్పుడు దిరుగుసతులకును చిరంబుగ। చిరసుఖంబును సిరియశంబును బరముగల్గు బ్రహ్మచారి। వరమానితనయా॥—మాటలు॥ నక్షత్రకార్య! సూర్యుని ఛాయాదేవి యెడబాయునే, చంద్రిక చంద్రు నెడబాయునే మయ్యా అటులనే సాంద్రపతివ్రతనై హరిశ్చంద్రమహారాజు నెడబాయ జాల. యీనృపాలుడు నాపాలిదైవంబు నానోముపంట. నాకూర్మివిభు డెవ్వరికమ్మిన బోదుగాని పతి నెడబాయలేనయ్యా పతిలేని సతికినిఖిల భోగభాగ్యంబులు గల్గిన నిష్ఫలంబులగు నాభర్తకౌశికుని మాయాంభో రాశిని సత్యవాక్యంబనెడియోడచే నిస్తరించిమునిఋణంబుదీర్పగలండు. గాననీవీరుఋక్తులాడకుమయ్యా. బ్రహ్మరుద్రేంద్రాదులు బొగడ సాంద్ర కీర్తి గల హరిశ్చంద్ర మహారాజచక్రవర్తి నిత్య సత్యస్ఫూర్తిచే కౌశికుండు నీవు మెచ్చ నిశ్చయంబుగ ధాత్రీతలం బేలగలడయ్యా నక్షత్రకార్య॥

సూత్రధారిమాటలు॥ ఓ తల్లి! చంద్రమతి! నీవాడిన సత్యవాక్యం బునకు దేవతలు మెచ్చి కుసుమవర్షంబు గురిపించిరి, దేవదుందుభులు మ్రోసె. నీమాట నిశ్చయంబని యాకసంబు భాషించెనమ్మ తల్లి॥




చంద్రమతిమాటలు॥ సంతసం బాయెనయ్యా సూత్రధారీ॥

నక్షత్రకునిమాటలు॥ ఒరే హరిశ్చంద్రా! మాబాకీపైక మివ్వవు గదా. నేనింక మావూరికి బోవలె. నాతల్లి నారాకడ కెదురుచూచుచుం డును. ఇన్నిదినంబు లెన్నడు తల్లినివిడిచి నేనుండలేదు గాన, ఈరాత్రితో తలబొడుచుకొని నెత్తురు నీపై చల్లెద. నంతవరకు మాధనం బివ్వవుగా ద్రోహీ! నేనింక నరక్షణంబైన నోర్వనురా॥

నక్షత్రకుడు హరిశ్చంద్రుని రెట్టబట్టి నిలవేసి ఖండితోక్తులాడుట.

రాజుమాటలు॥ అయ్యా నక్షత్రకా! ఈనట్టడవిలో రెట్టబట్టుకొని నిలబెట్టి వష్టురోక్తులాడిన ధనమెక్కడ దెత్తునుస్వామీ! చేతిలోజిక్కిన వాడవని ఇంత కక్కురితి బడనేల? కాశీపురంబుజేరినతక్షణంబుయెక్కడ నైనా కుదువవుండి మీపైక మిచ్చెద పదవయ్యా॥

నక్షత్రకునిమాటలు॥ ఒరేహరిశ్చంద్రా! నీమాటలుచూడగా, ఆశ జెప్పికాలంబుజరుపునట్లు తోచుచున్నది. నీయట్టి మోసగాని నేనెక్కడను చూచియుండలేదురా. రేవు మాపని నెలరోజులు జరిపితివి ఇక నేనెట్లోర్చియుందును. నేనేయునుకొనిననాకంటె మొండివాడ వైతివయ్యా నాజపతపంబులు పాడుచేసి యెన్నిదినంబులు నీవెంట దిరుగుదురా. నాకు వేసరికవచ్చె నియ్యడవి నడచి కాళ్లుతొడిబడసాగె, నేనింకపైకమిచ్చు వరకు విడువను. అయినది కానరా హరిశ్చంద్రా॥

రాజుమాటలు॥ అయ్యా నక్షత్రకా! కాలంబు దప్పి సత్యంబునకు కట్టుబడిన నన్నిట్టి నిష్ఠురాలాపంబులాడదగునే. మోసగాడనుకానయ్యా. మీబాకీ నేమాత్రమైన నిలుపను గాన. నామనవి విని నామానసంబు నొప్పింపక నేజెప్పినరీతిగ కాశీపురంబువరకురండి, ఇన్నిదినంబులుజరిపినా రింకక్షణకాలము తాళి పదండి. నామాటలుచూడండి మీరుంబడలినడువ లేకున్న నాభుజంబున నిడికొనిపోయెద రండిస్వామీ॥

నక్షత్రకునిమాటలు॥ ఒరేరాజేంద్రా! కానిచూతముపద. ఇంతధన మెక్కడదెచ్చెదవో. ఇప్పుడడిగ్యోడిపని అప్పుడయ్యావిపదరాహరిశ్చంద్ర॥

రాజుమాటలు॥ ఓచంద్రమతీ! ఈకాశీపురంబు జూచితే. యెంత రమణీయంబైన దీపురంబు ప్రాణేశ్వరి॥

చంద్రమతిమాటలు॥ అవును. యెంతరమణీయ్యంబుగదోచెమహాత్మ॥

కాశీపురవర్ణన—రాజు దరువు–హిందూస్తాని–భైరవి–రూపకము.

అందమైనదీపురము–సుందరాంగిజూడు–సుమహితముగ॥నం॥ ఎందు గలదిచిత్రమహిమ–ఇందునిందుధరుడుగల డరుదుగ॥నం॥ ప్రకట నీలరత్న కాంతినిఖిలదిశలమించెనిగనిగమని ముకురకుడ్యములముద మొదవగమకర తోరణములమదవతిగను ॥మం॥ చూపులలరుగోపురమున చోద్యమైనభవ నములవెలిగెడి ధూపములుచెలంగె–గరధృతగిరి బావునిలయమదియంతి గనుగొను ॥మం॥ వనజనయన వారిణాశిగనుము కనకసౌధచయములనడి

మనముదీని జేరి-ఘనతరంబుగ మునిఋణంబుదీర్తుమని తలచెద॥నం॥కలికి
బెడుదురీశు రఘునినిలయమిల ప్రసిద్ధి కెలసెనుభళీ॥ తలిరుబోణిమాడుతళతళ
మని వెలుగుకోటహీరకరుచినిచయము॥ అంద॥—మాటలు॥ ఓ చంద్రమతీ!
వజ్రమణిమయ ప్రభాకలిత సౌధగవాక్ష ప్రాకారంబుల నొప్పియున్న ఇ
ప్పురంబును బొడగ సురగపతికైన తరముగాదు సరసిజాక్షి! రమణీయ్య
విమల కల్హారంబులచే విలసిల్లు సకల తరంగిణీ తిలకంబైన గంగానదిఁ
కనుంగొను మంగనామణీ! మల మూమందాకినియందు స్నానంబుజేసి
ఇందుతరుని దర్శించిన మనదురితంబు లెడబాయునే భాసురాంగీ॥

చంద్రమతిమాటలు॥ ప్రాణనాయకా! మన మీగంగానదిలో
సంకల్పపూర్వకంబుగ స్నానంబుజేసి ఇమ్మహాదేవుని షోడశోపచారంబు
ల బూజింతము స్వామీ॥

రాజుమాటలు॥ అట్లనే చేయుదమురమ్ము రమణీ



హరిశ్చంద్రుడు. కాశీవిశ్వనాథస్వామి. చంద్రమతి.

దరువు—నాటకురంజి—ఆట.

గిరిజారమణా—హరశివశంకర ॥గిరి॥ పురహరనీసిరిగోలినదైవము—
ధరణిలోనగల్గునెయురగకింకణశ్రీ॥ గిరి॥ గజచర్మపరిధాన సుజననిధాస—
భుజగభూషణమీనధ్వజగర్వవిదళన॥ గిరి॥ శంకరదురితనాశంకరభక్తవ
శంకరనీపాదపంకజములగంటి ॥గిరి॥ ఈశ బెడుదూరుపురీశ మిత్రాంబర—కేశ
వందనము నేజేసెదను బ్రోవు॥ గిరి॥

నక్షత్రకుని ద్విపద—శ్రీరాగము.

అవనీశ నేడు రేపవధిగా గడువు—తివిరిముప్పదినాళ్లుదీరె నేనింక లెక్కిం
చితిని కాను లేదునీచేత—నొక్కడ దెచ్చెదవింక మాధనము — ఋణముదీర్పగ

ననుహూపంబుమదిని-గణుతింపవై తీవికాలయాపనము - జేసితివేనేమిసేయు దుఃఖన్న-మోసగించితివౌర మునియప్పుదీర్చ-నుద్దినీమదిలేనుస్థిరంబు గను-దద్దరిల్లకయుండతగునపాపాత్మ-భావురేమునితోడ బానలుబల్కి-రేపుమాపనుచుయిారీతిగాప్రొద్దు-బుచ్చెదవికనీకుబోలునేపైక - మిచ్చెద ననియాశలేర్పడజెప్ప-జపహోమవియతులుదాలించినేను కపులాటవులకు నీవెంటవచ్చితినిఖ్యాతిగాధనమరకాసైననాదు కేత్రికివచ్చుటలేదుభీయన కేను-దాక్షిణ్యమున నెకతతాళిననీకు-లక్ష్యంబులేదుగాలవమాత్రమైన-బొంకవై తే కప్పబోయు మాధనము-ఇంకసై రింతునేయినకులశిలక-కష్ట పెట్టుదునన్ను కాననభూమి-దుష్టమానసగుదిద్రోచెదనిన్ను - పోడిమిబెడు దూరిపురవరాధీశు డీడనిక్కడ తెచ్చనేము చూచెదను॥

నక్షత్రకుని దరువు-శ్రీరాగము-అట.

కదలనియ్యనురా-రాజేంద్రాని॥స్కడ॥అదిగో యిచ్చెద యిదిగో యిచ్చెద పదపదండని పదరి నాడగు-హృదయమును నొప్పించితివిగడ గుదురుగా నినుకూలద్రోయక ॥కద॥ త్రిణరవైరినితివిరితలచుచు జపము నేయుచునున్న దీరునేవిపులసత్యము విడిచిబొంకకతపనకులసంభూతనిన్నిక ॥ కద॥పైకమివ్వక బాకిదీర్చక జోకతో యిాశివునిదలచిన- శ్రీకరంబుగనిలను బెడుదూరులోకరక్షకసాక్షిగానిను॥కద॥--- మాటలు॥ ఒరేహరిశ్చంద్రా! నిన్ను మొగమాటంబు చేయుదగదు. కక్కసించి పెక్కుబాధలుపెట్టిన గాని మాఅప్పుదీర్చవు. గావున. నీకాళ్లుచేతులు కట్టగట్టి గుదిద్రోచెద. నీగట్టుదాటి పోవలదురా రాజేంద్రా॥

రాజుమాటలు॥ ఆహా! పరమపురుషా! భక్తవరదా! ఆదిదేవా! మహానుభావా! నీవేదిక్కు స్వామీ॥

చంద్రమతి దరువు-అసావేరి-అట.

ఏలాయిాగతిభూమిపాలునిగుదిద్రోయబోలునేబ్రహ్మచారీ॥చాలగ సత్యసంశీలునిసుజనద-యాళుడౌ యిారాజమౌళిని చలమున॥ యా॥ ఇల యేడుదీవుల నేలినఋపకులతిలకుడనుచునీకు తెలియదేమయ్యా సలలితధర్మ-సంచారకుసూనృతశీలితుడై కొలసిన కమలాప్తకులజుని॥యా॥ నిరతము బెడుదూరుపురవాసుపదభక్తిమురువక నెప్పుడుస్మరణజేయుచును- పరము మునీంద్రునిబాకిదీర్చనుగ నికరుణించివిడువుము తినముసేయకు॥ ఏల॥— మాటలు॥అయ్యా నక్షత్రకా! బానుగోత్రంబు పవిత్రంబుగజన్మించినిజ

భుజాదండ మండిత మండలాగ్ర ఖండితారాతి భూమండలాధీశ్వరుండై నిత్య సత్య వచన రచనా విశారదుండగు ఈరాజేంద్రుం డెట్టియాపద గల్గిన నసత్యమాడ నేరడు. గాన, నాప్రాణేశ్వరుని బాధ నేజూడజాల. నీయడుగులపై బడి వేడుకొనియెద. నాపై కరుణించి యితనిని విడువవలయును మహాత్మా॥

నక్షత్రకునిమాటలు॥ తల్లి! చంద్రమతీ! నీవింతగా నుల్లంబున కుళ్ళికుళ్ళి ఏలయేడ్చెదవు. మాపై క మిచ్చినిదె నీమగనిని విడువనమ్మా॥

లోహిదాస్యుని దరువు - ఆనందభైరవి - అట.

విడువవయ్యా-మాయయ్యను॥ కడకతోనిటుకాళ్లుచేతులు పెడకు గట్టిపుడమిదోయకు - వడుగనీయడుగులకునేసాంపలర మ్రొక్కెడి వేడికొని యెద॥విడు॥ క్షత్రధర్మవిచక్షణుడుయీధాత్రినేలినదాతవిశ్వామిత్రుఋణ మీరాత్రిదీర్చును చిత్రముగ నక్షత్రకార్యా ॥విడు॥ వారకను బెడుదూరు నేలినసీరజాక్షుని సాక్షిగానీ- కోరినట్టులఋణముదీర్చునుధారుణీసురతకవు దలపుము ॥విడు॥—మాటలు॥ అయ్యానక్షత్రకా! మిాబాకీపైకము నీ రాత్రికిలోగ మాతండ్రి ఇచ్చునుగాని, నామాటల కియ్యకొని మా యయ్యను విడువుము. నీయడుగులపైనబడి వేడుకొనియెదనయ్యా॥

నక్షత్రకునిమాటలు॥ ఒరేబాలకా! మాబాకిపైకము నిచ్చువరకు బ్రహ్మరుద్రాదులు వచ్చినను మీయయ్యను విడువనురా॥

చంద్రమతి రాజు సంవాదము.

దరువు - ఆది - జంఝూటి.

మానవనాధామానముయీ వేళ- సూనృతమునకై దీనుడవైతే॥

రాజు॥ పడతిరో యీమునికొడుకు ధనమిమ్మని - ఇడుములబెట్టనే నేమి చేయుదునో ॥పడ॥

చంద్రమతి॥ చింతసేయకు ప్రాణకాంత నీమదిలోన-పంతముతో మానిబాకి దీర్చుముహో ॥మాన॥

రాజు॥ అతివవిశ్వామిత్రు నప్పు దీర్చుటకు యే-మతముదోపదుగదె మానినీ మణిరో ॥పడ॥

చంద్రమతి॥ విశదముగనన్ను విక్రయమును జేసి-కుశికసుతుని బాకి కొంత దీర్చుదువో ॥మా॥

రాజు॥ హరిహర బెడుదూరుపురనివాసుడువిప-తరుణిరో యిటులన తగవగునేమె॥పద॥—గీ॥లలనసీవంటిరూపవిలాసవతిని! యమ్మకము సేయ జేతులెట్లాడునబల! హరిహరీయిట్టిదురితో క్తులాడినాడు । మనసునొప్పింప దగునేమెయంచగమన॥—మాటలు॥ ఓతరుణీ! నీకతంబున దవజ్వాలికా జాలంబులచే బాధ బొరయకుండ గుణతరంటవిగా గల కష్టంబునెల్లగడ తేర్చితి నాలుగంటీ! నాప్రాణపదంబవు, నాపాలిటి భాగ్యలక్ష్మి వి, నా వలపుల కొటారంబవు నాయర్ధాంగివగు నిన్ను పరుల కమ్మినే నేసుఖం బనుభవింతునే కాంతా॥

చంద్రమతిమాటలు॥ స్వామీ! నీవిది యేమి మూఢుని చందంబున పామరునికై వడి నిట్లుబలికెదవు. ఒకగడియ గడువుదప్పిన నిన్నుబొంకించుటకు కంకణము గట్టుకొనియున్నగాదేయుని గిన్కవొరుంగవే. ఈనక్షత్రకుండు ధన మిమ్మని కక్కసించుట చెక్కలిగొట్టి పాలు ద్రావించినట్లు మిక్కిలి మేలయ్యె. వాపీకూపతటాకారామదేవాయతనని ర్మాణాదిపుణ్య కర్మంబులకంటె సత్యభాషవిశేషసుకృతప్రదంబు గావున, గుణతరయశస్సారహీరావళులచే నిశాంగనాకుచయుగంబులలంకారంబుచేయుము. అర్థమునకు నొండనుపాయంబు లేమింజేసి చెప్పెద నాప్రార్థనంబుగైకొని నన్ను విక్రయించి అప్పుదీర్పు మగణితఫలదాయకా॥

రాజమాటలు॥ ఓపద్మగంధీ! ఈబంధుర దోషభాషణంబు లేల బలికెదవు గంధసింధురగమనా! పతులు దమకు గలకష్టదశలకులశీలరూపవయోదాక్షిణ్యాది గుణగణంబులుగల భార్యలపరిచర్యలచే బాసిసుఖింపుచుందురు. అట్టిభార్యను విక్రయించి బ్రతికెడు పాపాత్ముం డిలలోనం గలడే కలువకంటీ॥

చంద్రమతిమాటలు॥ ఓభూపాలకులశిఖామణీ! భార్యావిక్రయంబు పాతకంబైనను సత్యంబుకొరకు పత్ని నమ్ముట పాపంబుగానేరదు. అనృతంబుకంటెపాపంబులేదు. సూనృతంబుకంటె సుకృతంబులేదు నరుంగవె పతంగకులపుంగవా! ఈ ప్రతికూలవాక్యంబుల పలుకక త్వరితముగనన్ను దెగనమ్మి సత్యంబు నిల్పుము స్వామీ॥

దరువు - ధన్యాసి - ఆదితాళము.

రాజు॥ బాలీకామణి యెంతబాధగదైననీకు - బాలికుండగు-నాకు భార్యనైనందుకు ॥బాలి॥

చంద్రమతి॥ మనుకులతిలక యీమాటలుబలుకక-మునిఋణమును దీర్చి ఘనతవహింపుము॥ మను॥

రాజు॥ యేణలోచననిన్ను యితరులకమ్మినే-ప్రాణవాయువులెట్లు బట్టియుండుదునవో॥ చాలి॥

చంద్రమతి॥ కులసతిబాసిన కులమునశించిన-పలికిబొంకనివ్రతము నిలుపుట మేలగు॥ మను॥

రాజు॥ తరుణిరో నామాటదాటనోడుదువు యే-కరణినినమ్ముదు కరివరగమనరో। చాలి॥

చంద్రమతి॥సత్యమునిల్చిన చాలును బెడుదూరు-।దైత్యకులాంతకు దయకు పాత్రుడవౌదు॥మను॥—— మాటలు॥రాజేంద్రా! విను. మీవని వార్యధైర్యంబునవలంబించి ఈమోహపాశంబుద్రెంచిధనమిచ్చిననెవ్వరి కైనసరే నన్ను విక్రయించిసత్యంబునిలిపిమునిఋణంబుదీర్చినిరుపమాన యశఃపరిపూరిత ధరణీతలుండవై సుకృతంబు నొందుము స్వామీ॥

రాజుమాటలు॥ తరుణీ! సకలరాజకాంతలుగొలువనంతిపురంబున నుండెడి నీకు నానిమిత్తంబున నిట్టిపాటుగల్గెనే పాటలాధరీ! నాగసువ్రమీర వేరతువేపడతీ! నాకన్ను సన్నుల మెలంగుచుంటివేవన్నెలాడీ! హా రాకాచంద్రముఖీ!హాకాంతామాళీరత్నమా!హాహరినీల వేణీ! హాబాలా! నిన్నెన్నటికిమెడబాయ ననుకొంటినే. నేటితో పాపపుదైవంబు మనల నెడబాయజేసెనే, పరులకడ నెట్లుపనులు చేసిమెలంగెదవురమణీమణీ॥

నక్షత్రకుని దరువు-నవరోజు-ఆది.

నీమొగమాటం ।బేమిరమాకిక-పామరమతిమాపైకము దేరా॥నీ॥ ఏకతముగనీవీకమలాక్షిని-పోకడబెట్టుము-పోయినయంతకు॥ నీ॥ వారక బెడుదూరినీరజాక్షునితో-ధీరుడవై బాకి దీర్పుము వేగమె॥ నీ॥—— ఉ। ఓ కమలాప్తవంశవినుమూరకె కాలముజర్పుచుండనీ। కేకరణిన్ ఘటించు ధన మివ్వకుతీరదు నెలెమ్ము లెమ్ముమా।యాకలొసంగ వేనినసూయాధిక బొంకుము బొంకున్ననీ । పోకలుమాలి యాలినికపోకడబెట్టుముపోయినంతకున్ ॥—— మాటలుఒరేహరిశ్చంద్రా!నీవుచెప్పినగడువునేటితోదీరుచున్నది రాచంద్ర మతిదప్ప నీకు వేరుధనం బేమియులేదు. ఇంత సంకటపడనేల? బొంకితి వనుము. విడిచిపోయెద. అసత్యమాడవైతివేని అంగడికివచ్చి నీకులాంగ నను తెగనమ్మి మాయప్పుదీర్పుమా రాజకులాధమా॥

రాజుమాటలు॥ ఓచంద్రమతీ! ఇమ్మునితనయునినిష్టురాలాపంబుల కేనోర్వజాల బాలా! మనకెంతటివిపరీతకాలంబుసంభవించెనే యంభోజ ముఖీ॥

చంద్రమతిమాటలు॥స్వామీ!ఇంక శంకింపవలదు. నన్ను తెగ నమ్మి సత్యంబు నిలుపుము రాజేంద్రా॥

రాజు-గీ॥అహహా యెటువంటియాపద లందవలసె!పూజ్యకరమైన నాదుసామ్రాజ్యలక్ష్మి!వైననిను తెగదమ్ముదునట్లుజేసె!విధికృతమునాకు గడువంగ వెరవులేదు॥---మాటలు॥కాంతా!ఇంతటి దురంత కార్యంబు చేయనెంచితి.పూర్వకర్మఫలంబనుభవింపకతీరునే.ఇమ్మునికొడుకునుడువు లనెడి పిడుగులుబడి నాయొడలెల్ల దుడుకుచున్నవి పడతీ! నిన్ను తెగ నమ్మి అప్పుదీర్చెద లెమ్ము కోమలీ॥



హరిశ్చంద్రుడు చంద్రమతిని విక్రయించుట

దరువు-తోడి-అట.

వారిజనేత్రియీవనితనమ్మెద నేనుకోరినధనమిచ్చికొనరారయ్యా॥
వా॥భూమిసురులుగానిపుణ్యమతులుగాని-కోమలగాత్రినికొనరారయ్యా॥
వా॥ రాజశేఖరులైన రమణావైశ్యులునైన- రాజముఖినికొనరారయ్యా॥
వా॥ సుదతినిచ్చెదగొనరె శూద్రజనములారాకుదురుగ బెడుదూరుకువలయే

శ్వరుతోడ॥వారి॥——మాటలు॥ అత్రిసమానులగుభూసురులారా । కమల మిత్రసమానులగు రాజపుత్రులారా!కుబేరసమాన ధనవంతులగువైశ్యలారా! అత్రిసమానధీరులగు శూద్రులారా! ఈనిద్దంపుచెక్కుటద్దంబులు గల ముద్దియ! ఈరాకాసుధాకరముఖి! ఈకమలపత్రనేత్రి! ఈకలకంఠి! ఈకోకస్తని! ఈమృగరాజమధ్య! ఈమదబంభరవేణి! ఈకీరవాణి! ఈ సుగుణమణి! నాపాలిభాగ్యలక్ష్మి! ఈపుత్రవతియగు మదీయకళత్రంబు నిచ్చెద. నెవ్వరైనసరే నేనడిగినంతధనంబిచ్చి కొనిపోవరయ్యజనులార॥

కాలకౌశికుని వేషము కథ.

శ్రీరాగము-గీ॥ లాజదేరెడిమోమునువణకుశిరము । నల్లమీసంబులునుచాలపిల్లి కండ్లు।చెడ్డచూపులుకరిమేనుచింపిగోడుగు । కంపుశిఖయును చింబోతు గడ్డమమర॥

దరువు - శ్రీరాగము - జుల్వ.

కలినచిత్తుడైన కాలకౌశికుండువచ్చెనపుడు కసరువీడనుచుచూచు జనులుదిట్టగానువినుచు॥కలి॥ విపులధనమువీటివారి కపరిమితమువడ్డికిచ్చి- కృపణబుద్ధిచేతనమితకపటమార్గనిపుణుడగుచు ॥కలి॥ మానుగబెడుదూరు పురరమాధిపతిని నెరుగలేక- దీనిభావమెల్లదనదు మేనియందుబాదుకొనగ

రాజుమాటలు॥ పదివేలువందనంబులయ్యా భూసురవర్యా॥

కాలకౌశికుడు-క॥నీవంశమునీపేరును। భావంబునదెలిసికానిప్రస్ఫురితముగా । దీపింపరాదునీవిపు । డీవనితను విక్రయించెదేయక్కరకై ॥—— మాటలు॥ అయ్యా! నీవేకులంబువాడవు. పేరేమి. ఈయమ్మలాడి నమ్ముటకు కారణం బేమి నిన్ను జూడగా బలసియున్నవాడవు. హాలికవృత్తిచే గాని కూలిచేసికొనిబ్రతుకవచ్చునే. ఆలిని అమ్ముటయుచితమేమయ్యా! హా! తెలిసె. నీయంగన నెక్కడనో దొంగలించుకొనివచ్చినాకులాంగన యనుచు విక్రయింపజూచెదవు ఇప్పురి తలవరులుచూచిన నిన్ను బాధించెదరు దీనివిడిచి ఎక్కడనైన యురుకుము. కాదేని, నాబుద్ధి విని ఈ ముద్దుగుమ్మను నాకు దానిసిగానిచ్చి నామరుంగుజేరుము, ఎంతటిదొరలు వచ్చిన నిన్ను గాచి రక్షించెద నిటులజేయుమయ్యా॥

రాజు-మత్తకోకిలవృత్తము॥ సూర్యవంశుడనేద్రిశంకునిసూనుడన్ వసుధాస్థలిన్ । చౌరకృత్యమునేటిమాటొకసారివినలేదెన్నడున్ । శౌర్యవృత్తిజరించుక్షత్రియజాతిసేద్యము చేయునే। కార్యమారయలేకనీవిటుకా

రులాడకు బాపడా॥—మాటలు॥ భూసురోత్తమా! నేనిక్ష్వాకుకులజుండ త్రిశంకుమహారాజపుత్త్రుండ. హరిశ్చంద్రుడనువాడ. నేనేలెడిభూమిలో నిదివరకు దొంగతనం బనుమాట వినలేదు. నేటికి నీనోట వింటి. భుజబలంబుచే జీవించెడు క్షత్త్రియుడు సేద్యము సేయునేమయ్యా॥

కాలకౌశికుడు॥మత్తకోకిల॥వింతలయ్యెడినీదుపల్కులు విస్తరంబుగ దెల్పుమా। కాంతనమ్మెడి దేలనో మహీకాంత నీవిక నిల్పుమా। పంతమాయిది రాజధర్మముపాడిగాదని యెంచుమా। శాంతుడౌ బెడుదూరుధాముని చాల మదిమతియింపుమా॥—మాటలు॥ అయ్యా! నీమాటచే గొంతవిశదమాయెగాని, అయిన భార్య నమ్మెడి పనియేమయ్యా రాజేంద్రా॥

రాజుమాటలు॥ భూసురోత్తమా! విను నేవిశ్వామిత్త్రులకు సప్తద్వీపవసుంధరాతలంబు దానమిచ్చి యజ్ఞార్థమమ్మునికి బాకిపడినరూకలకై కాంత నమ్మవేసెద. నీకు శక్తి కలిగెనేని కోటివరహాలిచ్చికొనిపొమ్ము. లేదేని ఈవెడమాటలాడక తొలగిపొమ్ము బాపడా॥

కాలకౌశికునిమాటలు॥ అయ్యా రాజేంద్రా! అప్పుదీర్చుటకై ఆలినమ్మెడుఅధములుగలరేమయ్యా! అప్పులవారేమి సేయుదురు రేపుమాపని ఆశజెప్పి కాలంబుజరిపిన వేసరి వారే చాలించుకొనియెదరు. యొకవేళ అడ్డగించెరేని మొండికిబడితలరాయిచేకొట్టుకొని మారుబలుకక మానాభిమానంబులు దలంపకున్నవా రేమిసేయుదురు. ఈరీతినప్పు లెగరవేయవచ్చును. నీవు నాబుద్ధి వినిన యాకౌశికుండు నిన్నేమిచేయునయ్యా॥

రాజుమాటలు॥ ఓభూసురాధమా! నీవంటి పరమలోభి కీయుపాయంబు జెల్లునుగాని నాకు చెప్పకుమయ్యా॥ బ్రాహ్మణా॥

కాలకౌశికునిమాటలు॥ అయ్యా రాజేంద్రా! నీవెంతధర్మాత్ముడవు, సత్యముకొరకుగా సతి నమ్మెదవా? పైక మిచ్చెదగాని. అయితేనిచెప్పిన ధరకుకొనేవా రెవ్వరుగలరు. ఖండితమైనమాటచెప్పుమూ రాజేంద్రా!

రాజుమాటలు॥ అయ్యా బ్రాహ్మణా! సత్యవాదినైన నేను రెండుమాటలాడుదునె నీకిష్టమయ్యెనేని కోటివరహాలిచ్చికొనుము. లేదేని తొలగిపొమ్ము బాపడా॥

కాలకౌశికునిమాటలు॥ అట్లనేయిచ్చెద గైకొనవయ్యా॥

నక్షత్రకునిమాటలు॥ పైకము తేవయ్యా బ్రాహ్మణా॥

కాలకౌశికునిమాటలు॥ ఓసీహంసనారీ! నీకు కోటివరహాలిచ్చికొంటి నికపోదాము పదవే వాలుగంటీ॥

హంసనారిమాటలు॥ అట్లనేపోదాము పదండిస్వామీ॥

రాజు–గీ॥ ।ఆర్యనామాటవినుమింక నావుగొనియు। దూడవిడుచుట భువిలోనదోసమంద్రు । గానవీనికిగాకోటికనకమిచ్చి। గొనుమునావుత్రు నిచ్చెదఘనముగాను॥—మాటలు॥ ఓభూసురోత్తమా! గోవునుగొనిదూడనువిడుచుట ధర్మవిరుద్ధంబై యుండు. గావున, వీనికిగాకోటివరహాలిచ్చి కొనిపొమ్ము బ్రాహ్మణా॥

కాలకౌశికునిమాటలు॥ రాజేంద్రా! నీమాట సరేగాని దూడకు వేరే గోవుకు వేరే వెలలేదు. ఇది లోకాచారంబై యుండును. గాన. నీ మాట ధర్మంబునకు విరుద్ధంబుగ నున్నది భూపాలకా॥

రాజుమాటలు॥ భూసురోత్తమా! నీవీ దుర్భాషలాడక నేచెప్పిన ప్రకారంబిసువురికివరహాలిచ్చికొనిపొమ్ము లేదేనితొలగిపొమ్ముబ్రాహ్మణ

నక్షత్రకునిమాటలు॥అయ్యా!మీరేల వాదించెదరు మీయిద్దరికిని మధ్యవర్తినై నేబంచాయతి చెప్పెద వినుండి, తొలుత ఈబ్రాహ్మణునికి నీవు భార్యనువిక్రయించెడికాలంబున తల్లికివేరే పిల్లవానికివేరే ధర చెయ్యలేదు. కాబట్టి, నీమాట గతజలసేతుబంధమాయె. నీకొడుకు సహా ఇతనికి దక్కిపోయె ఇకయేల చింతించెదవయ్యా రాజేంద్రా॥

కాలకౌశికునిమాటలు॥భళిరానక్షత్రకా!నిన్నుగన్నదిరాతల్లి సై మంచిదర్మంబు చెప్పితివిరా॥

రాజుమాటలు॥ అయ్యోదైవమా! ఈకలుషమతి యగు నక్షత్రకుండు పిలువనిపేరంటమువచ్చినరీతిగా, నేమధ్యవర్తినని ఇట్టిఈధర్మంబు చెప్పె. నేనేమిచేయుదు, విధికృతంబునకు వగచిన దీరునే స్వామీ॥

చంద్రమతి దరువు–తోడి–జుళ్వతాళము.

పాపదైవముమనకునిట్టిపాటుగల్గజేసినే–నాపురాకృతకర్మఫలము ననుభవింపకదీరునే॥పాప॥నీకుసేవలుజేసి జగతినేనుబ్రతుకజూచితి–నాకు పుణ్యము లేకపోయె నాధనిన్నడబాసితి॥ పాప॥ మమ్ముమరువుముసత్యవాక్యముమరువకుండుముభూపతీ– ఇమ్ముగబెడుదూరునేలినయింది రేశుడేగతి పాప॥—మాటలు॥ఓప్రాణనాయకా! కౌశికునిమాయాపాశంబులగట్టుబడితిమని లేశమైన చింతింపకు ధర్మంబె జయంబగును. నీసత్యమే నిన్ను రక్షించును,నీకు శ్రీహరికటాక్షంబునను. నానోముఫలంబునను. మరల సామ్రాజ్యంబుచేకూరును,మమ్ముమరచిపొమ్ముసత్యవాక్యంబునుమాత్ర

ము మరువక పాటింపుము. నేనెన్నియపరాధంబు లొనర్చినను మన్నించుచుంటివే ఇంకపోయివచ్చెద, సెలవిమ్ము దెపది వేలువందనంబులు ప్రాణేశ్వర॥

రాజుమాటలు॥ఆహా! కడుసుఖంబుగల్గును పోయిరమ్ము కాంతామణీ॥

## చంద్రమతి హరిశ్చంద్రుల సంవాదము

### దరువు—[illegible]ఖారి—ఆది.

చంద్రమతి॥నన్ను నిన్నెడబాపెనా విధికృతము-నిన్ను విడిచి నేనెట్లు బోదునువహా॥నన్ను॥

రాజు॥ నేనెంత పాపినే నీరజనేత్రి-మానిఋణమునకుగాను నిన్నమ్మితి

చంద్రమతి॥నన్ను మరచిపొమ్ము నామనోహర - నన్నుగ సత్యము పాలించుమహా॥నన్ను॥

రాజు॥నిండాకొడిగట్టితి నే నీలవేణి-సుందరి నీముద్దుజూచు భాగ్యుడగాను॥నేనెంత॥

చంద్రమతి॥కన్నీరు నించుచు కలతజెందకుము—మున్నెంత పాతకము జేసినామొ॥నన్ను॥

రాజు॥నారీమణిరో బెడుదూరినిలయుడు - భూరిదుఃఖము మనలబొందజేసెనహా॥నేనెంత॥

చంద్రమతి॥ బెడుదూరివాసుని పెంపులేదాయె - కడపటికిని మనకీగతులాయెనహా॥నన్ను॥

రాజుమాటలు॥హా చంద్రమతీ! మనవేడుక జూడజాలక నిరుపురనెడబాపిన పరమేష్టి కేమిసాధ్యముగలుగును సురమణీ! నేనుండ భాగ్యుండనై ముందువెనుక దెలియలేక నిన్నమ్మితినింకేమని వగచిన దీరునే మగువా! పరులకడ బనులుజేసి కష్టపాటునకోర్చి నీసద్వ్రతంబు చెడకుండ నెట్లు వర్తింతువో కాంతా॥

చంద్రమతిమాటలు॥ఓజీవితేశ్వరా! అయినపనులడలచి మీరేల వగచెదరు, పూర్వకృతదోషఫలంబనుభవింపక తీరునే. కాగలకార్యంబు కాకమానునా, నా కానతివ్వుము స్వామీ! నిన్ను విడిచిపోవ కాళ్ళాడవే, పోవకున్న దీరదే, నా ప్రాప్తంబున కేమని చింతింతు నాథా! సకల భోగభాగ్యుండగు నీకునిట్టినిచదశ రాదగునే, నిన్ను విడచిపోవనా కానతివ్వుము పదివేలువందనంబులు ప్రాణేశ్వరా॥

కాలకౌశికునిమాటలు॥ చపలమతీ! కపటమార్గంబులన్ని తొలగి పోచూచెదవు. నిలునిలు మింటికిపోదాము వాలుగంటీ ఈమాటమోసుకొని పదవే హంసనారీ॥

హంసనారిమాటలు॥ హాచక్రధరా! పురాణపురుషా! నా కీవ్రాత వ్రాసెనే దైవమా! అట్లనే తెచ్చెదను తెండి స్వామీ॥

బ్రహ్మచారులు కాలకౌశికుని దన్నుట.

ఒరేభూసురాధమా! ఈపుణ్యవతిని బెట్టుగగొట్టెదవాకట్టడీ! మాముష్టిఘట్టనలచేనిన్ను ప్రాణావశిష్టునిగావించెదము జూడరా దురాత్మా॥

హంసనారిమాటలు॥ అయ్యా బ్రహ్మచారులారా! నాపైన దయయుంచి వీరిని విడిచిపొండు మహాత్ములారా॥

బ్రహ్మచారులమాటలు॥ అమ్మా పుణ్యవతీ! నిన్నుజూచి ఈదురాత్ముని విడిచిపోయెదము తల్లీ॥

కాలకౌశికునిమాటలు॥ నిర్భాగ్యురాలా! ఈబ్రహ్మచారులునన్ను మర్దించుచుండగా, తలవరులకు జెప్పి వీరినిశిక్షింపక వెడమాటలాడిపోగొట్టితివే కట్టడీ॥

హంసనారిమాటలు॥ స్వామీ! నాపురాకృతకర్మం బీబడుగుబాపనిచే దెబ్బలుబడునటులజేసెనే స్వామీ! నాకు దిక్కుదోచక వారిని ప్రార్థించితే విడిచిపోయిరయ్యా మహాత్మా॥



కలహకంటకి కాలకౌశికుడు లోహితాస్యుడు హంసనారి

కలహాకంటకి వేషము కథ.

ద్విపద - శంకరాభరణము.

అటమీఁద నాభూసురాధముభార్య - కుటిలమానసబహుకోపదేవతయు-కలహాకంటికిభర్తగానంగవచ్చు-చెలువమేమనపల్లచింపిరితలయు-ఫాలంబుసుడియునుబకబాకినోరు - వ్రేలాడుకుచములుపీపునగూని - కోతిమోరయుపెదుగొగ్గిరిపండ్లు-రోతదేహంబునరొండినతీట - శిరమతియును దొప్పశ్రవణముల్పురకు-కఠినచూపులుదొడ్డికాళ్ళునడ్డి-ముక్కునల్లనిమేనుముఖవికారంబు-చెక్కుటపులిసిలి చేతులుకురుచ-సాగినమెడతోడసదమదంబుగను-బాగుగావచ్చునాభామినిజూచి-పురజనుల్బెడుదూరు పురవాసుడలచి - బారిబారినవ్వగ పొలతియవ్వేళ॥

దరువు - ఆది - కమాచ్

కలహాకంటకివచ్చెను-కాంతుని నరయుచు ॥కల॥ పులివలెరోజును పురసతులదరగ-చెలావునిబిలుచు చుచెమటలుజారగ ॥కల॥ ఇరుగుపొరుగువారెలమిదీగులచే-పరిపరివిధములబరువులుబారగ ॥కల॥ ధారుణిలోబెడుదూరుమందిరుడు-చేరిసభర్తను చెండెదననుచును ॥కల॥—మాటలు॥ ఓ జనులారా! మాయింటివ్యతీపాతను జూచితిరే॥

కలహాకంటకి కాలకౌశిక సంవాదము.

దరువు - రగడధ్వని - ఆది.

యేడీయేడీయేడీమా - యేబ్రాసీనిజూచితిరే॥
కాలకౌశికుడు॥ యేమేయేమేయేమే-ఓయింతిరోనన్నిటుబిలిచెదవు॥
కలహాకంటకి॥ ఔరాఔరఔరాయి - నారినియెక్కడదెచ్చితివీ॥
కాలకౌశికుడు॥ ఇంటిలోవంటలుచేయుటకు- కొంటినేనేనీకోమలినీ॥
కలహాకంటకి॥ కాటికానికానీరా - కాపురమేగతిజేసెదవు॥
కాలకౌశికుండు॥ వలదేవలదేవలదే ఈ-కలహాముసాత్రో కామినిరో
కలహాకంటకి॥ కూటికిగుడ్డకుగతిలేక - బోటేలరనీతలబోడ్చా॥
కాలకౌశికుడు॥ యేటికియేటికిగొట్టెదవె-బోటులునవ్వగబోలునటే॥
కలహాకంటకి॥ యాలనుయాలనునీ - వింటికిరారాజూచెదను॥
కాలకౌశికుడు॥ చాలునుచాలును బెడుదూరి-శౌరినిదలచవేసంసారి

మాటలు॥ ఓపాపాత్మురాలా! నాపై ఇంతకోపం బేలచేసెదవు, సైరింపవే భాగ్యశాలీ॥

కలహకంటకిమాటలు॥ ఓయతీపాతా! బహుకాలము నుంచి గడిచినవిత్తమంతయు కొల్లపెట్టికొంప కోలుపుచ్చితివే. ఈసంసారం బెట్లు గాలబెట్టుకునయ్యో! నాకడుపుదరికొంటుందే. కాటికే కాళ్లుదాచుకొని కోటివరహాలు పాడుచేసి బిడ్డలనోట గడ్డవేసితివే ప్రేతవాహకా।

కాలకౌశికునిమాటలు॥ ఓసీకంకభ్రష్టా ముసలిదానవుపనిచేసుకోలేవని దానిని దెచ్చితినే. ఇంతగా గొంతు చించుకొనియెడవేల నీయబ్బగంటేమిబోయె, చిన్ననాడుమొదలు ఇదివరకు నేననేక శవములుమోసి సంపాదించి ఖర్చుచేసితి పోతేపోయెలే॥

కలహకంటికి కాలకౌశిక సంవాదము.

దరువు-శంకరాభరణము-అట.

ఔరౌరసీవునన్నుడుగనిదెనేడు-కోటివరహాలన్నికొల్లబెట్టితివే॥

కాలకౌశికుడు॥ చిన్ననాటినుండియెన్నెన్నోశవములు-పన్నుగమోసి సంపాదించినాను॥

కలహకంటకి॥ఇరుగుపొరుగువారికెలమితోనుగ్గులు పరువడినమ్మిన పైకముగాదా॥

కాలకౌశికుడు॥యేకాహములుచేసిరూకలునేదెస్తి-నీకెక్కడిదేవో నెలతవరహాలు॥

కలహకంటికి॥ కట్టెలమ్మి నేను గడియించినా నింక-వట్టికూతలు కూయవలదునాతోడ॥

కాలకౌశికుడు॥ దివసాలుజేసితద్దినములుబెట్టించితి-వీరిదుర్దానములదెచ్చినధనము॥

కలహకంటకి॥సిగబట్టియీడ్చెద సిగ్గుమాలినవాడ- జగతిలోబెడుదూరుజలజాక్షుతోడు॥

కాలకౌశికుడు॥హరిహరిబెడుదూరుపురవాసుసాక్షిగ-శరణించవే నీకడగిమ్రొక్కెదను॥—మాటలు॥ఓభాగ్యశాలీ! నీకాళ్ళకుమ్రొక్కెను నన్ను విడువవే॥

కలహకంటకిమాటలు॥ఓఓకుటిలమతీ! కట్టెలునుగ్గులనమ్మినేగడించి గంటుకట్టిన ధనంబు పాడుచేసితివే యతీపాతా॥

కాలకౌశికునిమాటలు॥ఒసీకంకభ్రష్టా! షోడశైకాహంబుల ప్రేతాన్నంబులు ప్రీతిగా భుజించి దివసాలుజేసి తద్దినాలుబెట్టి కూలి దీసుకొని గడించితి నీకెక్కడిదే కట్టుడీ॥

కలహాకంటకిమాటలు॥ అయితేకాని ఈప్రొద్దు పాతపొరక నాన బెట్టిజుట్టుపట్టుకొని నీపని ముగించెద పద ప్రేతవాహకా॥

హంసనారిమాటలు॥ అమ్మా! కలహాకంటకీ! యిదియేమి ధర్మ మమ్మా! భర్తనుకొట్టి తిట్టుటకు తగవగునే. జగతిలోమగువలకు మగడే దైవమైయుండునట్టి పెనిమిటికెదురాడినయాడది యూరబందియైజనించు, పతిభక్తిగలచెలులకు సౌభాగ్యంబుగల్గు: నిహపరసౌఖ్యంబు బొందునట్టి ధర్మంబు దలంపక యజమానునిపై నింత దురంత కోపంబు చేయుదురే కాంతా॥

కలహాకంటకిమాటలు॥ ఒసే! మాయిద్దరకు తగవు దీర్చుటకు నిన్నెవరు బిలిచిరే. నీవెరింగిన ధర్మంబునెవ్వరెరుంగరా, జగతిలోమగ వాండ్లనడతనేనెరుంగనా. నాపేరెరుంగవా. మృత్యువైననానాయెదుటనిలు వభయపడును నీవెంతదానవు. నాకుబుద్ధిచెప్పెదవా మిటుకులాడీ! ఈకుటిలునిపై కోపంబునీకుగావ్యయపరచెద నింక నోరుమూసికొనుమా భామ॥

హంసనారిమాటలు॥ ఆహా! చక్రధరా! పరమపురుషా! నావిధి ఈజరభిరండరక్కసిచే చిక్కుమనివ్రాసెనె దైవమా॥




కలహాకంటకి హంసనారి సంవాదము.

దరువు—కాఫీ—ఆట.

పనమీర హంసనారి యీపొరకతో—కసవుజిమ్మవే మిరారీ॥—

మాటలు॥ ఒసేహంసనారి ఈమొద్దుపొరక దీసుకొని మదీయ్య గృహాంగణంబున బాగా కసవుజిమ్మవే మిరారీ॥

హంసనారి॥ ఈమొద్దుపొరకచేత నేనెట్లుదైవమ–కసవుజిమ్ముదు॥ మాటలు॥ హాదైవమా! సకలరాజకాంతలతో పనులుచేయించుచుండెడి నన్నీకష్టాత్మురాలింటనిట్టి కష్టంపు పనులుజేయపెట్టితే పరమేష్ఠీ! ఈ మొద్దుపొరకబట్టి నేనెట్లు కసవుజిమ్ముదుదైవమా అమ్మా! కలహాకంటకీ? బాగా కసవుజిమ్మినాను చూడవమ్మా తల్లీ॥

కలహాకంటకిమాటలు॥ ఒసే! యెక్కడి కసవక్కడనే యున్నదే, నీవేలాటిసంసారివే॥—దరువు॥—చేడెరో నీవింకను పేడనీళ్లు హాడిమిగాచ ల్లుము॥మాటలు॥ఒసేహంసనారి! ఈకడవచేది పేడనీళ్లుచల్లి ఇల్లువాకిలి అలికి ముగ్గుబెట్టవే భామా॥

హంసనారి॥ తెల్లముగానావిధియిచ్చట – పేడనీళ్లు చల్లగ వ్రాసెనే! మాటలు॥ హా! నావిధి ఈబడుగుబ్రాహ్మణిచే జిక్కి పేడనీళ్లుచల్లుసట్టు చేసెనే. ఈకడవచేది నీళ్లెటుచల్లుదు ఇల్లలికిముగ్గునెట్లబెట్టుదు దైవమా అమ్మా! కలహాకంటకీ! పేడనీళ్లుచల్లి అలికి ముగ్గుబెట్టితిని చూడవమ్మ॥

కలహాకంటకిమాటలు॥ ఒసే! యెక్కడ తెరప లక్కడనేయున్నవి మాడవే భామా॥ దరువు॥ ఈవడ్లుపోసి దంచి బియ్యము - బాగాతియ్యవే నూకలెల్ల॥—మాటలు॥ ఒసేహంసనారి! ఈవడ్లుదంచి చెరిగి బియ్యము వేరే నూకలువేరే తియ్యవే భామా॥

హంసనారి॥ రోకలిబట్టి దంచజేసెనే – నాకీకాలమునకువిధి॥— మాటలు॥ అమ్మా! కలహాకంటకీ! వడ్లుదంచి బియ్యము బాగా చేసితి చూడవమ్మా॥

కలహాకంటకిమాటలు॥ ఒసే! బాగా బియ్యమున పోటుబడియుండ లేదు, ఊపిరిలేదా, పూటకుపడిబియ్యముతిండితింటావుగదవే వాలుగంటీ॥

హంసనారి॥ ఔరా ఈరక్కసిచేజిక్కితి-బెడుదూరు వేంకటనాయక మాటలు॥ ఆహా! పూర్వసంచితం బనుభవించక నెంత వారికైనా తీరునే. వగచుట ధర్మంబుగాదు. ఈచెప్పినపనులు చేయవలెగాక॥

నక్షత్రకుని–క॥ జననాయక నీవిచ్చిన! ధనమికనాభత్యమునకు దగ చెల్లుపడగ। వినుసత్యముడప్పకమా। మునిఋణమును దీర్చవడ్డిమొదలు సహితముగ॥—మాటలు॥ ఒరేహరిశ్చంద్రా! నీవిచ్చినపైకము నారోజు

మానాకు చెల్లుబడెనింకత్వరితముగ విశ్వామిత్రుఋణంబుదీర్చి సత్యంబు నిలుపుమా రాజేంద్రా॥

రాజు-గీ॥ బ్రహ్మచారి యిట్లుబలికెదవేమయ్యా। నీగురుండుతోలుత నీకుభత్య।మిమ్మటనుచునాకు నేర్పడ చెప్పడు । గానకు లియముగగానుతగను॥మాటలు॥అయ్యానక్షత్రకా! విశ్వామిత్రుండు నిన్నునాపై బరాతంబు బంపెడికాలంబున నీకు భత్త్యాయివ్వమని నాకు చెప్పియుండలేదు, గాన, నాభార్య నమ్మి పడిసినధనంబు మునిఋణంబునకు చెల్లువేసుకొనుము బ్రహ్మచారీ॥

నక్షత్రకునిమాటలు॥ ఓరేహరిశ్చంద్రా! మాగురుండు నన్నురహస్యంబుగాబిలిచి నీరోజుమానా ముందు తీసుకొని పిమ్మట మాపైకము సాధించుకొని రమ్మనినాడు గాన, నీకు నేబంటనా, నీవెంట కంటకారణ్యంబులు దిరుగుటకు నాకేమి పిచ్చిపట్టియుండలేదు. నేనేల భత్యము విడుతురా రాజేంద్రా॥

రాజుమాటలు॥ అయ్యా బ్రహ్మచారీ! అయితే ముందు మీముని ఋణంబు దీరనిమ్ము. తర్వాత నీరోజుమానా యిచ్చెదనయ్యా॥

నక్షత్రకునిమాటలు॥ ఓరేహరిశ్చంద్రా! నాచేతదొరికినదుడ్డువిడిచి నీవెంట గ్రామంబులు దేశంబులు తిరుగుటకు నాకేమి పిచ్చిపట్టి యుండలేదు. నీకత్తిచే నాకుత్తుక యుత్తరించి ఈధనంబుగైకొనరా రాజేంద్రా॥



నక్షత్రకుడు.



హరిశ్చంద్రుడు.



వీరబాహుడు.

రాజుమాటలు॥ హరిహరీ! ఇట్టినిష్ఠురాలాపంబు లేలబల్కెదరు స్వామీ! సేవినజాలనయ్యా. భార్య నమ్మినపైకము నీచేతచిక్కిపోయె. ఇంక మునిఋణంబు దీర్చుటకు నాకేమియుపాయంబు దోచలేదు. గాన, ఈపురంబులోధనమిచ్చువా డెవ్వడైనసరే వానికినన్ను బంటుగా నమ్మి అరపీసమైన కొదువలేకుండా మీబాకిపైకము గొనిపొండు స్వామీ॥

నక్షత్రకునిమాటలు॥ ఒరే హరిశ్చంద్రా! అయితే నీకుడిభుజమునకు నాపుస్తకముదారంబుగట్టి ఈపురిబజారువెంట అమ్మకము జేసెదరార॥

నక్షత్రకుని దరువు – కమాచ్ – అట.

జననాధునిగొనరారె మీరీ ॥జన॥ ఘనుహరిశ్చంద్ర భూకాంతు డెగ నమ్మెద ॥జన॥ అడిగినధనమిచ్చి యవనీశుగొనరయ్య–కడుపుణ్యమతియైన కాకుత్థ్సవంశునీ॥జన॥ ఇలయేడుదీవులుయేలినబలశాలి–పలికిబొంకనియట్టి పరమధార్మికుడుయీ ॥జన॥ ధాత్రిధానమువిశ్వామిత్రునికొసగి పవిత్రుడై ధరణిలోవెలసినవాడుయీ॥జన॥ ఖేతాళువధియించియాతతశౌర్య – సమేతుడై జగతిలోఖ్యాతిగాంచినయీ॥జన॥ వెలయశ్రీబెడుదూరి వేంకటేశ్వరు భక్తి–గలిగినసూనృతవాక్యగౌరవచిత్తునీ॥జన॥—మాటలు॥ ఓజనులారా! ఈనిజభుజాగ్రమండితమండలాగ్ర ఖండితరిపు భూమండలాధీశ్వరుండును, శరణాగతవైరి రక్షణవిచక్షణుండును, దిగంతవిశ్రాంతకీర్తికాంతామనోహరుండును. సప్తసాగరపరివేష్టితాఖిలవసుంధరానాయకుండును, ఇక్ష్వాకుకులప్రవర్ధనుండును నగు హరిశ్చంద్ర మహారాజచక్రవర్తిని సేవిక్రయించెద. నెవ్వరైనసరే నేకోరిన ధనంబిచ్చి కొనిబోవరయ్యా పురజనులారా॥

వీరబాహుడపుడు నటకు వెడలివచ్చెను – కోరిపనుల చర్మములను గుదిచుకలుబుంగబూని–యూరివారునొదుగుచుండ భోరనభూరమణుజేర వీర॥ మొలనుకాసెబోసినట్టి మురికిపాతతోలునధుము – వలనుజుట్టియున్న చిరుతవారుక్రిందజీరలాడ॥వీర॥ నొసటచెందిరంపుబొట్టుపసనుతలనుకొప్పుజుట్టు–మిసిమిశాలిప్రేలికను మెరయబట్టి కల్లుద్రావి ॥వీర॥ కన్నులెఱ్ఱజేసి మిగులకంపుతోడ మీసములను పన్నుగానుదీటుకొనుచుభళిరెబెడుదూరీశ యనుచు ॥వీర॥

నక్షత్రకునిమాటలు॥ ఒరే నీవెవడవురా॥

వీరబాహుమాటలు॥ ఆహా! నన్నెరుంగవా॥ నేనుద్దండకాలదండధరుండ వణడగినవాడ. గండుమిగిలి ఇప్పురంబుననుండెడివారలకు భయంకరుండ. చండాలకులపాలకుండ. వీరబాహుం డందురయ్యా బాపడా॥

నక్షత్రకునిమాటలు॥ అయితే నీవిక్కడికెందుకువచ్చినవాడవురా॥

వీరబాహుమాటలు॥ అయ్యా! నాకొకడు జీతగాడు కావలసి, ఇక్కడ యెవరినో అమ్మకము చేయుమాట విని వచ్చితినయ్యా॥

నక్షత్రకునిమాటలు॥ అయితే నీవు గొనేటట్లుంటే॥ నేనీతని విక్రయించెదరారా ఒరే॥

వీరబాహు దరువు - యదుకులకాంభోజి - అట.

నిక్కముజెప్పయ్య రొక్కమెంతోయీనికి ॥నిక్క॥ తక్కుబిక్కు చేయకయ్య దబ్బరలాడకయ్య ॥నిక్క॥ కులమేమి తలమేమి గోనములు చెప్పయ్య. పలుమారునాయొద్దపనులుచేయునేయీడు ॥ నిక్క ॥ జాగేల యిప్పుడెసరగునపై కమిత్తు-బాగుగనోబుడుత బాపనయ్యనీవింక ॥నిక్క॥ బెడుదూరిపురిలోన బేరొందివెలసిన-కడగి శ్రీవేంకటేశుకరుణగలవాడను నిక్క॥—మాటలు॥ బాపనయ్యా! వీడు నాయెదుటనిలిచి బంటుపనులు చేయునేని నీవడిగినంత ధన మిచ్చెదనయ్యా॥

రాజు-క॥నీవెక్కడనేనెక్కడ। భావంబునదెలివితప్పిపలికెదవినిరో! భూవరులుగన్ననీదగు। కావరమునుదీరశిక్షగావింతురిలక—మాటలు॥ ఒరేచండాలా! నీమేనికంపునకు ఝుమ్మ్ఝుమ్మని ఈగలు ముసురుకొని కల్లుద్రావి పెల్లురేగి తెలివిలేక సొక్కుచు సోలుచువచ్చి నాయెదుటనిల్చి యేమిపల్కెదవురా, నన్ను గొనుటకు నీవర్హుడవా. నీవెక్కడనేనెక్కడ. ఇమ్మునికుమారుండెక్కడ. ధనమిచ్చుటయెక్కడ. ఈదురహంకారంబు మాని తొలగిపోరా చండాలుడా॥

వీరబాహు-గీ॥ దండపాణినగుచుదండింతుజనములు। దేవతలకునన్ను దెలియరాదు। యెలమిమాలడనుచుయీసరింపకునీదు। తండ్రికులముమాని దలపవలదే॥—మాటలు॥ ఒరే! నన్ను బలుమారుమాలడని యేలబ్రేలెదవు. నీయబ్బకులమునకు. నాకులమునకు భేదమేమిరా. ఇంతటిమానిసి విప్పడుగుచేపల చిక్కుబడితివి. నీతోబలుమాటలేల. ధనమిచ్చినదానులకు కొదువగలదా. మెతుకులుచల్లేవారుండిన కాకులుకు కొదువాపోపోరా॥

నక్షత్రకుని-గీ॥మానవేశ్వర నీవన్నమాటయేమి । యెవ్వడైనను ధనమిచ్చెనేనినన్ను। విక్రయింపుమయని వీని వక్రుడనుచు । ధిఃకరించుట తగునయ్య తెలివిలేక॥—మాటలు॥ ఒరేహరిశ్చంద్రా! నీవెవ్వడైననేమి. మా ధన మిచ్చువాడే శ్రేష్టుడు. నీవన్నమాటమరచితివా. ధన మిచ్చిన

వానికి దాసునిగ నన్నమ్ముమని పలికితివి. వీని చండాలుండని వాదించె దవు. నన్నెరుంగవా. విశ్వామిత్రశిష్యుండ. నక్షత్రకుండనువాడ. నేచేయు ప్రతిజ్ఞ వినుము. వీడిచ్చునంత రెండింతల ధనంబు మరెవ్వడిచ్చినను నిన్ను వీనికే విక్రయించెద, ఈరద్దుసుద్దులు మాని వీనివద్ద కుదువవుండి బాకీ దీర్చెదవా. లేక బొంకితివ ననకవా త్వరితముగ దెల్పురా రాజేంద్రా॥

వీరబాహుమాటలు॥ భళిభళిరే బాపనయ్యా! నిన్ను మెచ్చితి. ఇమ్మాటతప్పవద్దు. నన్ను హీనకులుండని వీడన్నపలుకునావెదకు ముల్లి కైయున్నది. గాన. నీధనమిచ్చి ఇతనిబంటుగా నేలెద. యెంతధనమో చెప్పవయ్యా బాపడా॥

నక్షత్రకునిమాటలు॥ ఒరేవీరబాహుడా! యొక్క మానవుండేనుగు నెక్కి నిక్కి గోటిచే రత్నమెగర మీటిన యెంతపొడ వగునో అంత పొడవు రాశిబోసి ధనమిచ్చి వీని బంటుగా నేలరా వీరబాహుడా॥

వీరబాహుమాటలు॥ అయ్యా బాపడా! నీమాట సరేగాని. నా మాట వినుము. వీడు పరదేశస్థుడు సంసారిగనుండలేదు. ఇంతధనమిచ్చి కొంటే వీడు నాయొద్దనిలిచి బంటుపనులు చేయుటకువూటయెవడయ్యా బాపడా॥

నక్షత్రకునిమాటలు॥ ఒరేహరిశ్చంద్రా! నీవుసత్యవాది వైతివేని, వీనితో బాసచేసి మాధనమిప్పింపుము. గడువుదీరిన నీమాటబొంకగును. నీవెంట యెంతకాలంబు దిరుగుదురా. నాకేమి పనిలేదా. యెన్నటికిని నీగోజు వగదెగదే మరేమిమిడుకుము. నీమొగమాటంబు మాకేమిరా. మాపైక మిచ్చెదవా లేక బొంకెదవా. త్వరితముగ జెప్పుమింక నాకు పనిగలదు. మావూరికి బోవలెరా హరిశ్చంద్రా॥

రాజుమాటలు॥ ఆహా దైవమా! ఈబ్రహ్మచారినిష్ఠురాలాపంబుల కేన్నోర్వజాల నేలీలనైన మంచిదేకాని కాశికనిఋణంబుదీర్చి లోకంబున కీర్తినిల్పెదగాక॥—మ॥ వినుమానాదుప్రతిజ్ఞ నేనిదెజగద్విఖ్యాతిగాబల్కె దన్॥మునినాథాగ్రణియప్పుదీర్చుమికసమ్మోదంబుగానీకునే । ఘనభక్తిన్ బనిసేతుతప్పినేనుఖడ్గంబుచేకంఠమున్ । యనుమానింపకద్రుంచి నీపదము పైనర్పింతుతేజంబునన్॥—మాటలు॥ ఓచండాలకులోత్తమా! నాకు తల్లి దండ్రులు. గురుదైవంబులు జ్ఞానధైర్యంబులు, ఆలుబిడ్డలు అన్నియు సత్యంబుగాని నితరంబులేవు. సత్యంబు గడువనేరక నివ్వడుగుచేదిక్కు-

పడియున్న వాడను. ధరణిలో సూర్యకులజుం డగు త్రిశంకుమహారాజ పుత్రుండ. హరిశ్చంద్రుడనువాడ. కౌశికునికి సర్వరాజ్యంబిచ్చి యజ్ఞార్థమమ్మునికి గాకీపడిన రూకల కిటువచ్చినాడ. నాప్రతిన వినుము పంచభూతంబులు సాక్షిగా నీకు నేదాసుడనై నీచెప్పిన పనుల తప్పకచేసెద. ఇందుకుతప్పిన ఈఖడ్గంబుచే నాశిరంబు దెగసరికి నీపాదంబులపై యర్పింతు నిమ్ముని కుమారునకు ధన మిమ్ము పుణ్యాత్మకా॥

వీరబాహుమాటలు॥ అయ్యా బాపడా! నీవడిగినంత ధనము తీసుకోవయ్యా॥

నక్షత్రకునిమాటలు॥ ఓహరిశ్చంద్రమహారాజా! వినుమాచంద్రతారార్కముగ సత్యంబునిల్పితివి.మాగురుండగువిశ్వామిత్రునిఋణంబు వడ్డిమొదలుదీర్చితివి. నీమనోభీష్టంబు నీకు త్వరగా సిద్ధించును. నే నింక మాగృహంబునకు బోయివచ్చెద. నేబెట్టినబాధల మదింపక నాపైదయ యుంచుము రాజేంద్రా॥



హరిశ్చంద్రుడు కల్లుకావడిమోయుట.



వీరబాహువు.

రాజుమాటలు॥ కడుసుఖముగ బోయిరండుస్వామీ॥

వీరబాహుమాటలు॥ ఒరే వీరదాసుడా ఈకల్లుబుంగ, ఈగుదియ ముద్దర. ఈమాంసపుపుటిక దీసుకొని ఇంటికిపోదాము రారా॥

రాజుమాటలు॥ అట్లనేపోదాము పదండిస్వామీ॥

రాజు ఉరవు-భైరవి-రూపకము.

ఓకువలయదళనయనా-నాకీగతిచేకూరెనె॥ రూ॥ ప్రాకటముగ నాదైవపురాకృతమునుబోరివోవునే-ఓకమలభవార్చిత నేనేకరణినియీా డే రును॥రూ॥శ్రీలలనాహ్లాదయేశా యేలాగున తాళుదునిక- లాలితముగ క్షత్రియకులశీలుడనై గడపటికిని మాలలోగల స్థితి నిక-చాలాదయబాలింపుము॥ఓ॥నమ్మితినీపదయుగము నెమ్మదిలో, ముమ్మాటికి - ఇమ్మహిబెడు దూరీశ్వరసమ్మతిగానను బ్రోవవే-ఇమ్ముగ నాకభయంబును ఇమ్మాయిటు రమ్మాయిక॥నో॥—సీ॥ప్రబలతరానేకపశుకళేబరాక్రాంతంబుబహుళరక్తాంకితప్రాంగణంబు।ధైర్యవాశ్వధ్వానబధిర తాశ్వానంబునలవాంతి దుర్గంధబంధురంబు।మక్షీకాకీర్ణ దుర్మాంసతోరణబద్ధదారుస-భృతగృహాద్వార పటలి।వకంకగృధ్రానీకకరటికారావంబుగురుతరనూకర ఘుర్ఘురంబు।సురారాగ।పానమదభయంకరవిఘూర్ణి।తారుణాక్షీద్వయాత్కీణ క్రూరదృష్టి। నిష్ఠురాలాపసంకులనీచమనుజ।ఘటితచండాలవాటికేనెటులబోదు॥—వ॥హా! నేను త్తమకులంబునబుట్టికడకు మాలలపాలైతినే. నాప్రారబ్ధకర్మంబుననాలినమ్మితీ.యాపుణ్యవతిమనోహారంగియగుచంద్రమతి, గండుపిల్లి బారిబడినచిలుకవలెయాభూసురినియాజ్ఞకుజిక్కి కొంపలో నెట్లు దినంబుల గడుపుచున్నదో.యెంతసంకటంబు ననుభవించుచున్నదో, కఠినాత్ముండగు కాలకౌశికుని ఘుర్జన భర్జనల కేరీతివాళునో దైవమా! ఈ చండాలునిల్లుచూడగానతీదుర్గంధబంధురంబైయనేకపశుకళేబరమాంససంకవితంబై కాకగృధ్రానీకకలకలధ్వానంబై ఝుమ్మునయీగలుముసురుచున్నది.ఈచండాళునింటపనులెట్లుచేతురాదైవమా! ఆహా! నాపుణ్యవశంబున నాకలిదప్పి లేకుండునట్లు దైవానుగ్రహంబుకలిగెనింకభక్తిచే వీరబాహునిగొలుచుటకు యేమిసందేహింపబనిలేదు. వీడుచెప్పినపనులు చేసెదగాక॥

వీరబాహుమాటలు॥ ఒరే! నాకాళ్లు బిసుకరా వీరదాసా॥

వీరదాసుడను హరిశ్చంద్రరాజుమాటలు॥ బుద్ధి. అట్లనే బిసికెద తెండిస్వామీ॥

వీరబాహుమాటలు॥ఒరే వీరదాసుడా! పూటపూటకు ఇంటిలో గింజలిసిరి నీళ్లుదెచ్చి కట్టెలుకొట్టి మాంసంబువండి చర్మంబు మడతలు పడకుండ నెండవేయరా॥

రాజుమాటలు॥ బుద్ధి చెప్పినప్రకారమన్ని పనులు చేసెదనుస్వామీ॥

వీరబాహుమాటలు॥ ఒరే! ఈవశ్యా కుతమ్మ దోసిట నుమిసెద బారవేయరా॥

రాజుమాటలు॥ అటులనే పారవేసెద తెండిస్వామీ॥

వీరబాహు-గీ॥ ఓరినీభక్తిమెచ్చితివీరదాసు। డనెడు పేరువహించి నాయాజ్ఞతోడ।గుదియముద్దరబూని।నీవదదు లేక । కాటిభూమిని రేబగల్కాంచియుండు॥ —మాటలు ఒరే వీరదాసుడా! ఈపురిప్రేతభూమి నేగుత్తచేసినాను. గనుక, నీవచట కావలిగానిలిచి వచ్చినకళేబరము వకటింటికి వకమాడచొప్పున వసూల్ చేయరా ఒరే!

రాజుమాటలు॥ మంచి దటులనేచేసి పైకమును మీకడకు బంపుచుండెద. గుదియముద్ర తెండిస్వామీ! ఆహా !వీనియింటిపనులుచేయుట కంటె ప్రేతభూమియందు నివసించుట మేలయ్యె.ఈభేతాళునితో నిచట శిలాస్తంభసంభృతంబుగా నొకమంచెబెట్టించి దానిమీద ఖడ్గసహాయంబుగ్గలచిభూతప్రేతపిశాచబ్రహ్మరాక్షసులతోబనులు చేయించుచుండెదగాక. హాదైవమా! నేటికి పంద్రెండునెలలయ్యె ఆలుబిడ్డల నెడబాయవలసె. పతివ్రతాశిరోమణి కొడుకుతో నెట్టిదుఃఖంబు ననుభవించు



హరిశ్చంద్రుడు ప్రేతభూమియందు నివసించుట.

మున్నదో నానిమిత్తంబున నాపుణ్యసతికినాపదల్ కల్గెనిక నెన్నటికి వారిఁ జూడగల్గు. హా! యిదేటిమమత. ఈమోహపాశంబులద్రెంచినై చినిశ్చల మతినై యిచ్చట కావుగా నుండెదగాక॥

కాలకౌశికునిమాటలు॥ ఒరేలోహితాస్యుడా! ఈ యూడాదినుంచి కోడెకానివలె మూడుపూటలు భుజించి ఆడుచున్నావుగా, నేడుమొదలు దినదినంబును నీతోడిబాలురతో నడవికేగి సమిత్కుశఫలాదులు దెమ్ము భ్రష్టా॥

లోహితాస్యుని దరువు—జంఝూటి—రూపకము.

అడవికిబొమ్మనుచు గొట్టెబడుగుబాపడు— కడగిత్రోవనడచిపోవగ లేజననిరో॥అడ॥ పన్నుగానువెంతో బాధపడున్ వోసీవు — నిన్నువిడచిపో ననన్నుగన్నతల్లిరో॥అడ॥ బాలుడనకకొట్టితిట్టి కాలకంటకుడు— కేలజడనుబట్టి యీడ్చె నేలబడితినే॥అడ॥ నాతిరో బెడుదూరురమానాథుడింకను — భీతి గలుగజేసెమనకుబిసరుహాక్షిరో॥అడ॥—గీ॥ తల్లి యీబ్రాహ్మణుడు చంప పెళ్గుమనగ। గొట్టియడవికినేవేగి కట్టియలను। దెమ్మిపొమ్మనినాజడ తెగగ బట్టి। యీడ్చిచదికిలబడద్రోచె నేమిసేతు॥—మాటలు॥ అమ్మా! ఈ బడుగుబ్రాహ్మణుడు కడుకోపంబున నాజడబట్టికొట్టివెనదినంబును వనంబునకుఁబోయి కట్టెలాకులుదెమ్మనె నేనెటుపోదునమ్మా తల్లీ॥

హంసనారి యను చంద్రమతి దరువు—ఆది—ఆనందభైరవి.

అడవికినినుబొమ్మనిపల్కెనేయీయువనిసురవరుండు— కడుపసివాడి కొడుకనకిట్టులనుడువగనాతనినోరెట్లాడెర॥ అడ॥ జనపాలకసుతులు నిను గొలువగఘనముగనుంటివేతండ్రీ— అనయముభూమిసురాధమునింటనుబ నులుచేయఁ గనుబనిచెనేనీవిధి॥అడ॥ నిన్నడబాసినేనెటువలె ధైర్యముని లుపుదురాతనయా—కన్నడచేసెనెకౌశికుమాయలు— పన్నుగాయికయేబా ధలుకల్గునో॥అడ॥ ప్రాకటభోగసౌభాగ్యముగల్గినభామలకునుబుట్టక — నా కేలగల్గితినందన బెడుదూరు—శ్రీకరాంగుడయునీకుసిద్ధించునే॥అడ॥ మాటలు పుత్రకా! సౌభాగ్యంబుగల సతులకు బుట్టి కడుసుఖంబు ననుభవింపక నిర్భాగ్యురాలగు నాగర్భంబునం దేలకల్గితివన్నా కన్నీ రేలనించెదవయ్యా యెన్నికష్టములుకల్గిన మనలకోనిన బ్రాహ్మణుండుచెప్పినపనులుచేయక తీరునే. బహుసుకుమారుండవు. కారడవులకేగి కట్టియ లెట్లుకొట్టి తెచ్చెదవురా తండ్రీ॥

లోహితాస్యునిమాటలు॥ అమ్మా! విధికృతంబునకు వగచుట తగునే. మన కధికారిగా నున్న బ్రాహ్మణునిమాటమీరుట మేరగాదు. గాన, నీపాదపద్మంబులకు వందనం బాచరించెద. అడవికి బోయివచ్చు పట్లు దీవింపవమ్మా॥

చంద్రమతిమాటలు॥ అన్నా! ముద్దులకుమారా అడవికి బోయి వచ్చెదవా తండ్రీ! నిన్ను సురగరుడగంధర్వులుపాలింతు రింతేగాక, నే పతివ్రత నైతినేని నీకెన్నికష్టములుకల్గినతుదకుభూతప్రేతపిశాచ బ్రహ్మ రాక్షసపక్షిపన్నగవ్రాతంబులచేప్రాణభీతి లేకుండునట్లుగ నీకుడిభుజం బున కొకరక్ష గట్టితి నిక సురక్షితంబుగ బోయిరావన్నా తండ్రీ॥

బ్రహ్మచారుల దరువు—శంకరాభరణము—ఆది.

అడవికిబోయివత్తము రారమ్మనినడచిరిభూసుర బాలకులుకడుమో దంబునగట్టియలాకులుక డిది—ఫలాదులుగ్రక్కున దెత్తము॥ అడ॥ మావెం టనురామసలక చక్కని త్రోవను మేమేచూపెదము—కావలసినవిగైకొనివ త్తమునీవిప్పుడురానిమిషమాత్రమువ॥అడ॥ అరుదుగ శ్రీబెడుదూరుపురీశ్వ రుచరణంబులమదిమరుపకను స్మరణసేయుచునుజనిధరణీధరగురుగుహాం తములుకోరికచూపెద॥అడ॥—మాటలు॥ఒరేలోహితాస్యుడా! మేమడ వికి బోవుచున్నవారమునీవు వచ్చెదవేని రారా త్వరగా రాజకుమారా! ఒరేలోహితాస్యుడా! ఈకట్టియలేరిమోపుకట్టుము. ఈదర్భగోసి మోపు పైన బెట్టి ఈఫలంబులుకోసి బుట్టలోబెట్టి చంకకు దగిలించుకొని-ఈకట్టి యలమోపెత్తుకొని మావెంటరారా. అల్లదెమర్రిచెట్టుక్రిందబావిగలదు. అందుల నీరుద్రావి బడలికలు దీర్చుకొనిపోదాము రారా॥

లోహితాస్యునిమాటలు॥అట్లనేపోదాముపదండిస్వామీ! అయ్యా బ్రహ్మచారులారా! ఈబావిలోనీరుద్రావినంతనే కన్నులకు నిదురవచ్చు చున్నదిగాన, కొంచెము విశ్రమించెదనయ్యా॥

బ్రహ్మచారులమాటలు॥ ఒరేలోహితాస్యుడా! ప్రొద్దుచాలాబో యినదింక నిద్రలేవరా॥

లోహితాస్యునిమాటలు॥ఓస్వామీ! నేనెంతసేపు నిదుర బోయితి. ప్రొద్దుచాలాబోయెనే. మాతల్లినారాక కెదురుచూచుచుండునుగావున, త్వరితముగ బోవలె. ఈమానిమొదట మొత్తుగా బుట్టయున్నది. దీనిపై కాలూదికొని ఈచెట్టెగ్రాకి ఆకులుకోసికొనిపోదాము పదరయ్యా॥

బ్రహ్మచార్యులమాటలు॥ అట్లనేకోయరా రాజకుమారా॥

లోహితాస్యునిమాటలు॥ అయ్యోదైవమా! ఈభీకరభుజంగంబు నకొట్టుచు నాగిట్టకాలు కరచె నేనిద్రింపగా జూచి మాతల్లి నాకుడి భుజమునకు గట్టిన రక్ష విడుచుకొని ఈబ్రహ్మచారు లెక్కడనో డాగి పోయిరే. నేనేమిచేయుదురా దైవమా॥

దరువు - భైరవి - రూపకము.

స్వామియీక్రూరసర్పముగరచె నేనేమనివిలపింతునో- ప్రేమతో మాతల్లి బెంచిన బెరిగి యీపామునోటబడితిహా-అహాహా॥స్వా॥ మాతల్లి దీవనమాయమైపోయెనే-యీతరినను గావను దిక్కెవ్వరు॥ స్వా॥ సాహసమున తొల్లిసర్పమునకునెట్టి ద్రోహముచేసినానోయూహింపగ॥స్వా॥ బెడుదూరుపురివాసక డకునీయడనన్ను- కడ తేర్చితే దైవమాహా దైవమా॥ స్వా మాటలు॥ ఆహా! సప్తద్వీపంబు లేలిన హరిశ్చంద్రమహారాజు కొడుకునై పుట్టినయీభూసురునాజ్ఞకులోబడి వచ్చి యీయడవిలో దుష్టభుజంగంబుచే బడుమినినానొసట బ్రహ్మ వ్రాసినాడుగాన. నింక నేమి చేతునురా స్వామీ॥



లోహితాస్యుని సర్పంబు కఱచుట.

దరువు - ముఖారి - అట.

అయ్యో యీపాముచేనియ్యెడబడితినే - చయ్యనమాతల్లి కీగతి నెయ్యమున నెరుగించువా రెవ ॥౧॥ ముఖముతో నారాక కెదురుచూచు

చుంకు-విదితముగ మాతల్లి యాశలువడలె నేటికి నేమిచేయుదు ॥న॥ యే మందునాకుదిక్కెవ్వరీయడవిలో-నేమనుమాతో మాతల్లి యేమనినో మినదో శ్రీరామరామ ॥అ॥ లీల శ్రీబెడుదూరి పాలనీ వెగతి - జాల నామొరయాల కింపుచు జామాస్నగజాలువా రెవ ॥ర॥—మాటలు॥ దైవమా! ఈ సర్ప విషాగ్నిచే బాధితుండనై నేల వ్రాలితినే. నాకన్నతల్లి వాకీర్త జెప్పెడువా రెవ్వరునాదుస్థితివిని నాతల్లి యేరీతిగా ప్రాణంబులుదరించునో అకటా! ఈ సర్పవిషంబెక్కి నాలుక చెమటగట్టె దొడంగె. చిత్తంబువికలంబయ్యె దేహంబుపరవశంబాంచె. నేనింకనిలువగ జాలనయ్యో. ప్రొద్దుగ్రుంక వచ్చె. నీయడవిలో దిక్కెవ్వరిట్టి కాలంబుననన్ను కడతేర్చ సర్పశయన సర్పకంకణులగు పంకజాక్ష శంకరులే గతిగాని ఇతరంబు లేదు. రమా పార్వతీ రమణులారా! నన్ను పరిపాలింప మీకసాధ్యంబు లేదు. బాలుండ నామొరాలించి కరుణింపరే మహాత్ములారా॥

చంద్రమతి దరువు - జంఝూటి - రూపకము.

ఏలరాడో ప్రొద్దుగుంకెబాలుడిపుడునే - పోయిజూచివత్తమంటేపో వనియ్యదుబ్రాహ్మణి ॥ఏ॥ కానలో నాకొడుకుకెంతకష్టముప్రాప్తించెనో-దీనునై తిమిమాకునెవరుదిక్కుగలరికదైవమా ॥ఏ॥ అడవిలోనజిక్కినాడో ఆకలాయెనో లేకను - కడగివచ్చుచుద్రోవదప్పెనో కొడుకుయెక్కడ చిక్కెనో ॥ఏ॥ కేమినేతుభూమిలో నానోముఫలమెట్లున్నదో=రామదాసపోష బెడుదూరికామితార్థఫలప్రద॥ఏ॥—మాటలు॥హా దైవమా! నాకడుపులో చయిబెట్టికలచినట్లుల సంకటంబుబొడమదొడంగె. కడుపడిగానాకుడికన్న దరుచున్నది. నాకెట్టి యడరుప్రాప్తించెనో స్వామీ! నాకొడు కడవికి ప్రొద్దుబొడుపునబోయి రాకదడసి ప్రొద్దుగ్రుంకవచ్చెనే. బాలుడురానికారణంబేమో పోయిచూచివత్తమంటే ఈకలహకంటకి పోవనివ్వదే దైవమా! అడవిలో త్రోవదప్పెనో బడలికచే నెక్కడనైనాచిక్కుపడియున్నవాడోగాక, ఆకలికిచీకాకునొందెనో, నావిధికృతం బెట్లున్నదో స్వామీ॥

బ్రహ్మచారులమాటలు॥ అమ్మా హంసనారీ! నీకొడు కడవిలో మట్టిచెట్టుక్రింద పాముగరచి పడియున్నవాడమ్మా తల్లీ॥

చంద్రమతి-ఉ॥హాసుకుమారనన్ను విపదబ్ధినిముంచి తెలోహితాస్యహా! హాసుగుణాంబురాశివహహా తిఙణార్కసమాన తేజహా । హాసుచరిత్ర నిన్నిటుమహాహికినాహుతిగమ్మటంచుమయా।భూసురకృత్రిమంపువిధిబోలగ నీతలవ్రాసె నేమిరా॥

దరువు - ధన్యాసి - ఆది.

ఏమనివగతురా-యేదిరనాగతి ॥ఏ॥ ఈమహీనిను-నన్నెడబాపెన విధి॥ఏ॥పతిబాసియునీకతమునధైర్యము - ధృతయాత్మనునిల్పితిగదతండ్రీ॥ ఏ॥కాకోదరమునిన్ గరచెటివేళనీ-వేకరణినితల్లడిల్లితోగదరా॥ఏ॥ ఔరా శ్రీబెడుదూరుపురీశుడు - కారడవులనిన్నుకడతేర్చెనెతండ్రీ ॥ఏ॥—మాటలు॥హాలోహితాస్యా! ఇలయేడుదీవులేలెడిహరిశ్చంద్రమహారాజుకొడుకువై పుట్టిఇట్టిదుర్దశలబాల్పడితవేతండ్రీ!యాక్రూరకౌశికునిమాయయనెకుయురిజిక్కితి మిక్కుటనాకు దిక్కెవ్వరన్నా! పతినెడ బాసియు నీకతమున ధృతిగలదాననై యుంటినే తనయా! నిన్నెడబాసి నేనేవిధంబున ప్రాణంబులు నిల్పుదురా కుమారా॥

కలహకంటికి-ఉ॥ తోయజనేత్రినీసుతుని తోడనుపాయము జెప్పివుచ్చినా!డాయెడబామునోటలఁడెహాయనిటక్కటమారవిద్దెలన్! మాయలుబన్ని యేడ్చుచునుమాయిలువెళ్ళఁచనంగజూచెదో! నాయెడసాగుసేమెలఁల నామణినిన్నికబోవనిత్తునే॥—క॥ నీకంటెజాణతనమును । నాకెక్కువాలదుహంసనారీవినవే!శోకింపుచునుండగబను! లేకరణిన్ దీరు నెవ్వటజేయుదురే॥—మాటలు॥ఒసేహంసనారీ!నిన్నుమించినజాణనునేను సన్నున్ను మరిపించబోచూచెదవా నేబోవనిత్తునే. ఈవగలమారి యేడ్పు లేడ్చిన బనులెవ్వరు జేయుదురే మిటుకులాడీ! శుద్ధశుక్రవారం మసరసందె వేళ నట్టింటగూర్చొని యేడ్చెదవు లేవే పనులు చేయబోవే నగలాడీ॥

హంసనారి-మ॥వినవమ్మాదయజూడగవలయునీవీవేళ నన్నింకనా తనయుండుగ్రతరాహిదష్టులగుచున్ నానెట్టులున్నాడోయా. వనభూమిన్ బడివానిదెచ్చిబ్రతికింపన్ జాలమందిచ్చిగ్ర । తక్కనరక్షింపవేపుత్రభిక్షమిడినాకన్ బ్రేమసంధిల్లగన్॥—మాటలు॥ తల్లీ! నాకొడు కడవిలో పాము గరచి యేగతిగనున్నాడో తెలియరాదుగాన, నీవింక నాపై దయచేసి వానిదెప్పించి తగినమందిప్పించినాకు పుత్రభిక్షంబు బెట్టిపంపవే. నీ యడుగులపై నబడి వేడుకొనియెదవమ్మా కలహకంటకి॥

కలహకంటకిమాటలు॥ ఒసే! నాకాళ్లు విడువిడు. బాలుర పోరు మాన్ప ఫలంబులు దెమ్మనగా నీకొడుకు దుడుకుచేపుట్ట లెక్కవచ్చునా అట్టి పరమదుర్మార్గం కేలమిడికెదవు. బాగా కడుపునిండాతిండితిని కండలెగబెరికి పొగరుమించిన వానికి ఆగతి రాపలసిందె పోతెపోయెలే, ఈవగ లేడ్పులుడిగి పనులుకొడువ లేకుండా చేసినపిమ్మట చూడబోదువులే హంసనారీ॥

చంద్రమతిమాటలు॥ ఆహాదైవమా! ఈకలహాకంటకి యాజ్ఞమీరుట మేరగాదు. కొడుకుదుఃఖంబులు కడుపులో నడంచుకొని ప్రొద్దు గ్రుంకినపిమ్మట బనులుకొదువలేకుండ జేసి ఈపాపాత్మురాలిని నిద్రబుచ్చి బోయెద. అమ్మా కలహాకంటకి! మనయింట పనులన్నియుచేసి నీకుపాన్పు పరచినాను పవళించనమ్మా॥

కలహాకంటకిమాటలు॥ ఒసేహంసనారీ! ఈ పాన్పున బవళించెద గాని. నాకాళ్లు పిసుకవే హంసనారీ॥.

హంసనారిమాటలు॥ అట్లనే పిసికెదనమ్మా॥

కలహాకంటకిమాటలు॥ ఒసే! నీకు వూపిరిలేదా. పడిబియ్యము తిండితింటివే. బాగాపిసకవే అట్లనేనమ్మా॥

చంద్రమతిమాటలు॥ ఓదేవుడా! ఈజరభిరండరక్కసి కలువరింతతో నిదురజెందినది. నాకాలిచప్పుడుగాకుండ ఈయిల్లువెడలెద. వెల్లువలై పారుకన్నీరు రెప్పలకుగప్పుకొనియె దైవమా! నాకు బొడమినపుత్ర శోకాంధకారంబునకంటెనీయంధకారంబువిశేషంబైయున్నది. దారిగనుగొనుటెట్లు! ఈరాత్రికాలంబుననాకు సహాయంబుగా వచ్చువారెవ్వరు! చింతించినదేకునే. నాపతియందు నాకుగలభక్తియే సహాయంబుగ యాబ్రహ్మచారులు చెప్పినమార్గంబు బట్టిపోయెద. నయ్యో! ఈనట్టడవిలో మఱ్ఱిచెట్టు మొదటనుండెడి పుట్టపైన ప్రాలియున్నవాడ వేకుమారా! నీవిట్లున్న నెట్లు ప్రాణంబులు భరియింతునురా పుత్రకా॥



సర్పంబు కఱచిన కుమారుని పండబెట్టుకొని చంద్రమతి దుఃఖించుట.

చంద్రమతి దరువు - హిందూస్తానికాఫి - ఆది.

ఘోరాసర్పముగరచెనే కుమారానిన్నాహా ॥ఘో॥ అకటామనకు దిక్కెవ్వరీయడవిలోనాహా ॥ఘో॥ యేమంటివోయెట్లేడ్చితివో పాముగరువాగావా ॥ఘో॥ బాలుడనీ బాధాజూచి తాళజాలుదునా ॥ఘో॥ ధీరా శ్రీబెడుదూరు నేలుశౌరీలేడాయే ॥ ఘోరా ॥ మాటలు॥ ఆహాదైవమా! నాకుమారుని శరీరంబున ప్రాణంబులు డాగినట్టు తోచుచున్నది. వీనికర పాదంబు లుడుకుచున్నవి. ముక్కునవేడి యూర్పడరుచున్నది. మంత్రించిన బ్రతుకును స్వామి॥

దరువు - హిందూస్తానిభైరవి - ఆది.

ననుశించిపోయితేనాకేదిరాగతీ॥నను॥ మానిమాయతోనగూలితే నాకేదిరాగతీ॥నను॥పామువచ్చికాటునందేనె - నీమోముగందెనే ॥నను॥ మంత్రమహిమాపారదాయెనే- యత్రంబుపోయెనే ॥నను॥ లీల బెడుదూరీశు డేమాయె మనపాలలేడాయె ॥నను॥—మాటలు॥ అయ్యో! నాకొడుకు యడవిలో ప్రాణంబు లుండినట్లులేదే దైవమా! నేనిదుఃఖ డలినే వడువున పెడలనీయుదు. నాకడుపులో బడబాగ్నివలె శోకాగ్నిధగ్గువదరికొని మండసాగె. ఈయడవిలో దిక్కులేని యుక్కుపాటువాటిల్లె. నింకనెట్లుబ్రతుకుదును. నాయెడరు దీర్చువారెవ్వరయ్యో! నాకొడుకు కుడిరెట్టకుగట్టిన రక్షాయంత్రంబులేదే. నేనెంతమంత్రించిన సర్పవిషంబుదిగి బ్రతుకడె. చెడు పామెక్కడనుండివచ్చి కరచె. పుత్రమోహంబుచేనా మదికి నేనేధైర్యంబుదెచ్చుకొని బ్రతుకునను ఆశచేయెంతమంత్రించి విలపించిన నేమిఫలంబగును. చచ్చినవాడు మరలబ్రతికివచ్చునే దైవమా॥

ద్విపద - మారువ.

హాలోహిదాస్యహాసుకుమార- హాలలితాకారహాసుగుణధీర- కాలాహిచేజావగలవునీవనుచు- నీలీలబ్రాసెనేయెలమిబద్మజుడు - అక్కటానేడునియ్యడవిలోనిన్ను బ్రదుకొనివిధిగడతేర్చె నేతండ్రి మొలకనవ్వుల ముద్దుమాము నన్నడును - కలయజూచెడిపుణ్యకాంతగానైతి-వీనులకింపు నీవిమల వాక్యములు-నే నెన్నటికివిందు నెట్లోర్చుకొందు - నినుబాసి నేనింక నిమిషమేనియును - తనువునప్రాణముల్ ధరియింపజాల - పతిబాసినేహీన భాగ్యనైనీదు-శతమునధైర్యంబుగాంచియుండితిని - కడకునిన్నెడబాపికర్మఫలంబు-కొడుకునీకడకునన్గానిపోగదయ్యా - ఇలయేడుదీవులనేలుబాబున

కు-గలిగియునీగతిగలిగె నేనీకు - పలుమారునీవిట్లుబలవించుచుండ - యెలుగెత్తియేడ్చుయున వేమిరాతనయ - వెలయశ్రీబెడుదూరు వేంకటేశ్వరుడు-గలడను మాటనిక్కము గాకపోయె॥

దరువు - ధన్యాసి - ఆది.

రారాకుమారా-రాజీతశూరా ॥రారా॥ నీ రేజహితవంశోద్ధారుడవనుకొంటి-ఘోరాహిచేనీవుగూలితివయ్యయ్యో ॥రారా॥ కౌశికమాయ కడకీగతాయా-కాశిలోనీవిధిగడతేర్చె నేతండ్రీ ॥రారా॥ లాలితబెడుదూరి శ్రీలోలుడగుశౌరి-యీలీలజేసుటయెరుగకపోయితి ॥రారా॥—మాటలు॥ అకటా! లోహితాస్యా! నిన్నడబాసి నిమిషమైన నోర్వగలనా తండ్రీ! పాముగరచెటివేళ యెంతవలపించితివో, యెంతకష్టపడితివో కొడుకా! నీవు గలిగినప్పుడు నిఖిలదైవజ్ఞులు నిన్నుజూచిసకల భూతంబు నితడేలుననిరిగాని, సర్పవిషాగ్నిచే జచ్చునన రైరి. ఈఘోరాహి గరచుటచేరాహువుబట్టినచందురుచందంబున నీమోముకందిపోయినదే. బంగారుతొట్లనునిచ్చి యంగనామణు లూచుచుండినను నిదురజెందనినీవు ఈయడవిలో నాభీలసృగాలరవంబున కెట్లుదీర్ఘనిద్రబొందెదవయ్యా! కౌశికునిమాయాంభోరాశిమునింగితి మింకనాకుదిక్కెవ్వరు. యేమిచేయుదు. నీపాలివిధి ఈ క్రూరభుజంగంబై వచ్చెనే. నీవియోగాగ్ని కేనెట్టులోర్చియుందు. నెట్లు దుఃఖంతుయేదిరాగతి తండ్రీ! అయ్యో! యెంతవిపత్కాలంబు వచ్చినా ఈకలహకంటకి నిదురలేవకమునుడేబోయిబనులు చేయవలయును గాన, నీకు సత్యలోకంబు కల్గునట్లు యగ్నిసంస్కారంబు చేసిబోయెద రారా తండ్రీ॥—గీ॥స్వామి నేనింకయీప్రేతభూమిలోన । కెట్లుబోదును భూతంబు లెలమికూత । లిడగ ఝడియక వీనికి కడగియగ్ని । నెట్లుదగినింతుజేతు లెట్లానునయ్యా॥—మాటలు॥ హా దైవమా! ఈప్రేతభూమియందు కేకవేయుచు దిరుగుచున్న భూతప్రేతపిశాచబ్రహ్మరాక్షసుల కలకలధ్వానంబులు పతిభక్తిహేయంబు గల నన్నేమిచేయగ జాలునైన ఈనడురాత్రికాలంబున వీనిగాల్చుటకు కట్టియ లెక్కడదెత్తురా దైవమా! మంచిది. కాని, ఈప్రాంతంబులశవంబులగాల్పగా మిగిలినకొరువులతో వీనిదహించిపొయ్యెద కొడుకా! ఇక్కడ బరుండుము, నీకొరకు కొరవికట్టియలు దెచ్చెద తండ్రీ॥—సీ॥ చిరసంపదలుగల్గుసరసిజాక్షికిబుట్టి ధరణీతలంబేలదగుదునీవు॥నిర్భాగ్యురాలననెగడెడి నాదుష్టగర్భంబు నందేలగలిగితయ్య

మేనమామల ప్రేమగానవై త్రివితం డ్రియూరుపీఠంబుననుండ వైతి । సరివారు సేవింపపరిజనుల్ను తియింపసామ్రాజ్య మేలకరముసి తేర । ఈధరామండలం బెల్ల నేలినట్టి సాంద్రకీర్తులుగలహరిశ్చంద్రునకును కొడుకవై పుట్టి జీవంబుకొరతగాక వృద్ధిబొందకపోయి తే యిద్దచరిత॥—మాటలు॥ హాలోహిదాస్యా! సకల సౌభాగ్యంబుగలుగు కాంతలగర్భంబునందు బుట్టి రచింజీవివై ధరణియేలని నిర్భాగ్యురాలగు నాగర్భంబున నేలబుట్టితివి తండ్రీ! నిన్ను దహింపనేరీతి చేతులాడునురా పుత్రరత్నమా॥

వీరదాసు డను హరిశ్చంద్రునిమాటలు॥హా! ఈయర్ధరాత్రికాలంబున ప్రేతభూమిలో నంగనామణి యేడ్పు. ఎలుంగువినబడుచున్న దే. యుగ్గలంబగు ఈమంచదిగ్గం బారిపోయి యిదియేమో యెరుంగెదగాక॥

కందార్థము-మోహనరాగము.

వనితాయీనడురాత్రి॥ పనులకుశంకింప కేలవచ్చితినీవ। ర్తనమేమి పెనిమిటెవ్వడు।వినుపింపుమువినగనాకు ! వినుతసుశీలా । నీదుపేరు విని యెదబాలా।ఘనతరంబగు దుఃఖమేమిటగలిగె నేయీప్రేతభూమికి । నౌనరునాశౌశనముమదిగ్గై కొనక రాజనదిచట నేరికి।వినుతసుశీలా॥— మాటలు॥ ఓపడతీ. ఈనడుమ్రాత్రికాలంబునరుద్రభూమిలోయుల్లంబుదల్లడిల్లకున్న దాన వెంతసాహసురాలవు. ఏకారణంబున నిట్టిదుర్దశవచ్చె. నీభర్త యెవ్వడు? పేరేమి? యునికిపట్టెయ్యోది? తనయుండేటికి మృత్యుండయ్యె. నీవార్తయంతయు నెరుగింపు మంగనామణీ॥



హరిశ్చంద్రుడుమాటఇవ్వక పుత్రునిగాల్చ గూడదని చంద్రమతితో నేచుట.

చంద్రమతి కందార్థము-ముఖారి.

వరసుతనేనీపురిభూ।సురుదాసిని వీడు నాదుసూనుడుపేరుక్ । వర హంసనారియందురు ।కరమరుదుగనన్నునీదు । కరుణగన్గొనుమా ॥ తెలి పెదనాదుచరితమువినుము।ధరణీవు దేనియాజ్ఞతోనా వరతనూజుడుకుశ ఫలాదుల।కొరకుకానకునేగిభీకరయురగదష్టుండగుచునీల్గెను। కరుణగక్॥ మాటలు॥ఓనరవరోత్తమా! నేనీపురిబ్రాహ్మణునిదాసిని. నాపేరుహంస నారీ వీడు కుమారుండు. భూసురునాజ్ఞతో సమిత్కుశఫలార్థం బడవికి పోయి పాముగరచిమృత్యుండయ్యె, మీరెవ్వరో నాపైదయగల్గివచ్చిన భూతపతివో, సిద్ధుండవో గాక. నాకొమారునికి విషవైద్యంబుజేసి బ్రతి కించి పుత్రభిక్షంబు బెట్టుటకై వచ్చితిరో మీవృత్తాంతంబెరుంగింపుము పుణ్యాత్మకా॥

వీరదాసుమాటలు॥భామా! నేభూతపతినిగాను, సిద్ధుండనుగాను. విషవైద్యం బేనెరుంగ నీకొడుకుక్ బ్రతికింపక్‌జాల నావృత్తాంతంబు వినుము. ఈప్రేతభూమినిగుత్తచేసినచండాలకులవల్లభుండగు వీరబాహుని బంట. నాయేలికగుదియముద్రనాచేతికిచ్చి ఇచ్చటికివచ్చిన కళేబరమున కొకమాడ సుంకంబు గొనుమనిన, రేబగ లిచ్చట కాపుగా నుండుదు. నాపేరు వీరదాసుండ.నాయాజ్ఞలేని దే-ఈయర్ధ రాత్రికాలంబున కొడుకు కళేబరంబుదెచ్చికాల్పజూచెదవు,ఆడుదానవైనందున బ్రతికితివి. పురుషుండైన ఈకత్తిచే తల దెగ నరుకుదు. ఈకట్టియలు బేర్చినంతభూమికి మాడ యివ్వవలయును. నీవామేరదప్పక మాడయిచ్చి కళేబరంబు గాల్పుము, లేదేని. శీఘ్రంబుగా నెత్తుకొనిపొమ్ము మత్తకాశినీ॥

చంద్రమతి-గీ॥ నిఖలభూపాల మకుటమాణిక్యజాల। కిరణమండిత పాదుడౌధరణినాదు।కొడుకవై పుట్టితక్కటకడకునీకు । బుడమిచేరెడుగతి లేకబోయెగదర॥—మాటలు॥హాదైవమా!నిజదోర్దండ మండిత మండ లాగ్ర ఖండితాతిరిపు మండలాధీశ్వరుండైన సప్తద్వీపంబులేలినమహారాజ చక్రవర్తికొడుకవై పుట్టిననీకుచేరెడు నేలప్రాప్తిలేకపోయెగదరాతండ్రీ॥

హంసనారి దరువు-పీలురాగము-ఆదితాళము.

బాపురేనేనెంతభాగ్యశాలినిగానునాపైనదయలేకనన్ను బాధింప ను॥బా॥పుడమినేలినరాజుకొడుకువీడాయె-గడకుచేరెడునేల గతిలేకపోయె బా॥భూసురునింటికిదాసినైనాను - బాసజేసెదనొక్కకాసైనగానను॥బా॥

కూడుగుడ్డకు నేనురుదువున్న దానమాఁద యెక్కుడ దెత్తుజూడునఁ దయతోడ॥ బా॥గోచీపాతయెగానికోక గతి లేదు- ప్రాచీనకర్మముడాచీనబోదు॥ బా॥ ధరణిలో బెడుదూరుధాముని తోడు-నిరుపేదరాలనఁ కరుణతో చూడు॥ బా మాటలు॥మహాత్మా! నన్ను నీదయచూడుము నేనిరుపేదరాలిని, భాగ్యవంతురాలి నడిగినట్లు నన్నుమాఁద దెమ్మని బాధించెదరు. పుత్రశోకంబుచే సంతప్తచిత్తనై దుఃఖాంబుధి మునింగిన నన్నుద్ధరింపుము పుణ్యాత్మకా॥

వీరదాసుమాటలు॥ ఓ తలోదరీ! యేల వగచెదవు. ప్రాణులకు జీవంబు శాశ్వతమా సంపదలుస్థిరమా. విధివశంబునవచ్చెడి సుఖదుఃఖంబుల ననుభవింపక నజహరాదులకైన బోవచ్చునే. నీ వేడ్చిన నీకొడుకు మరలబ్రతికి వచ్చునే మచ్చకంటీ॥

హంసనారిమాటలు॥ ఓమనుజోత్తమా! గోరుచుట్టుపై రోకటిపోటుబడినట్లు మొదటనే దుఃఖజలధిలోబడి. మునింగెడి నన్ను మాఁద దెమ్మని బాధించెదరు. నాపురాకృతకర్మంబునకు మీరేమిచేయుదురు. కౌశికునిమాయదాయకై వడి మావెంటనంటి రేబగలు బాధించుచుండ మిమ్ము దూరనేల మహాత్మా॥

వీరదాసుమాటలు॥హాదైవమా! ఈకాంతామణి మదీయ్య కులకాంతగా నున్న దెంతకాలంబునకు జూడగనైనుస్వామీ! వెగ్గలం బగు శోకంబునకు బెగ్గడిల్ల సమయంబుగాదు. దుఃఖం బుల్లంబున నడంచుకొని మదీయ్యవృత్తాంతంబు దెల్పెదగాక॥—మ॥సరసీజాక్షునిపూజమానికడకీచండాలునకఁ గొల్చితిఁ బోరిసత్కీర్తులువీటబుచ్చికులముఁ బోకార్చితిఁ ధాత్రిదుర్భరమా కాటికికాపునై తికడుదుర్భావుండ నేనింక సత్కరుణాసారమునాకుగల్గునె రాకాచంద్రబింబాననా॥—మాటలు॥ ఓకాంతా! కులశీలవృత్తంబుల మాలపాలుచేసి నిఖిలకష్టదశల కాటపట్టయిన ఈవల్లకాటి కధికారినై ననాకుకరుణయెక్కుడగల్గును మానినీ! నాస్థితియట్లుండని. నీవు సప్తద్వీపవసుంధరాధిపతికొడుకువై తివని బాలునిపైబడి యుంగలార్చెదవు అట్టిచక్రవర్తిభార్యనయిన నీకొకమాఁడకు గతిలేదా. అంతకన్నయెక్కువ మేమడుగము ప్రకృతము నీకుమాఁడలేకున్నందుకు బదులుగా నీమంగళసూత్రంబు కుదువబెట్టి కొడుకును గాల్చిపొమ్ము నెలతా॥

హంసనారిమాటలు॥ హాదైవమా! యెవంతిబుగంభేలు జ్యోతిష్మంతుండను రాజునకు కూతురనై దుష్టలగ్నంబున నేపుట్టినయతండు

పెట్టెలోఁబెట్టి యేటిలో వేయబంపిన నన్ను మయుండను బ్రహ్మర్షి సంరక్షించి చంద్రమతి యను పేరుపెట్టించి హరిశ్చంద్రమహారాజునకిచ్చి పెండ్లిసేయుకాలంబునతనతపశ్శక్తిచేనాపుట్టినదుష్టలగ్న దోషంబుబోయి సౌఖ్యంబు గల్గునట్లుదీవనలిచ్చి నామాంగల్యంబు నాభర్తకుదప్ప నితర పురుషుల కగుపడకుండు నని వరంబొసగె నదిమొదలు నాపాతివ్రత్య మహిమచేమదీయమంగళసూత్రంబు మినుకు నాప్రాణనాథునకుదప్ప నితరుల కగపడదేగాన, నిమ్మహానుభావుండు నాపతియే, గాన, ముని ఋణంబు కొఱకై చండాలునింట కుదువయున్నవాడయ్యో!

దరువు–జంఝూటి–రూపకము.

అయ్యోమీకిటువంటి కష్టములాయెనెనాథ – దయ్యములకావుగా నీతనుసవామె నేవిధి॥అ॥కౌశికునిమాయచేతగాసిబొందితే – లేశమైనమదికి చింతలేకయున్నవే॥అ॥కడకువల్లకాటికినికాపునైతివే– కడిదిసత్యమువిడువలేకకలతబొందితే॥అ॥ఈమహిబెడుదూరునేలుస్వామికరుణతో – నేము మాయెనీకునేమునుచేయుపుణ్యము॥ అ॥—సీ॥ ఈమంచె నవరత్న హేమ సింహాసనమాయెనేరాజకులావతంస। ఈభూతజాలముల్హితపురోహితమంత్రిపరిజనంబులెభూమిపాలతిలక। యీశివారుతము మీకెలమిమాగధగీతమాయెనేసార్వభౌమాభిరామ। ఈకొఱవిదయ్యముల్భికరభటవర్గమాయెనేనుజనవిధేయనీకు॥మనుజశిరములుఘనమైనకనకకుంభ। చతురమె యీ వెంట్రుకలునీకుచామరములే॥ప్రేతభూమియుమీకుసాకేతపురమే। ధారుణీనాథవిధినెట్లుదూరుదకట॥– మాటలు॥ప్రాణేశ్వరా!నీభోగభాగ్యంబును మీభుజబలైశ్వర్యంబునుమీప్రాభవంబు నెందుబోయె సప్తద్వీపవసుంధరాధిపతివైననీవుకడ కీవల్లకాటి కధికారివైతివే ఇట్టి దుర్దశలదురటిల్లు నిన్నుచూచినాయుల్లంబునపెల్లువగచెద. ఈమఃఖాంభోరాశి నెట్లుధరింతునుస్వామీ॥—తే॥గీ॥ ప్రాణనాయకనీచిన్ని బాలులోహిత। దాస్యజూడుమునీయూరుతలమునందు।నిద్రబోయెడుకరుణీసిరుద్రభూమి। నొరిగి యున్నాడుగాత్రంబు మరచినేను॥

రాజు దరువు–నాదనామక్రియ–ఆది.

చెదిరనాగతి–తనయా–తనయా–తనయా–నాగతి॥ఏది॥ ముదముతో నాదగుముచ్చటదీర్చకవిదితముగానావిధియిట్లాయెర॥ ఏది॥ పాముగరచి నవుడేమనివగచితో–శోకములాంగనాకొడుకా – కొడుకా ॥ఏది॥ బాలుడ

భూతలమేలక సమసితే-పోలగనేనెటు తాళుదు రాయిం॥ కేది॥ తడయక బెడు దూరిధాముడు లేడా యె-కొడుకా యింకెటు కడతేఱుదు నిం ॥ కేది॥—సీ॥ దారిద్రమని యెడి తామిస్రమునకు నువరతనూజుడు తిగ్మకరుడటంద్రు । కృత దోషలతి కావితతిద్యుంపనౌరస పుత్రుడే శాతలవిత్రుడంద్రు । భూరిసంచిత పాపమాలాటవికి కుమారుడే ఘోరతీక్ష్ణకుఠారమంద్రు । దివ్యలోకావాస భవ్యసంపదలకు సూనుడే తగు పెన్నిధానమంద్రు । కొడుకు కలిగిన వారికి కొదువగలదె । కులము రక్షింతువని చాలదలచియుంటి । పుత్రశోకంబు నొందిన పురుషవరులు । మరణకాలంబునకు దాని మరువగలరె॥

మాటలు॥ హా పుత్రకా! ఇహపరసుఖంబులకు కారణకర్త పుత్రుడై యుండు. పుత్రులుగలవారికి గోత్రంబు పవిత్రంబై యుండు. ఇట్టి నిన్ను గని యెడతెగని సంతోషసౌఖ్యంబు గలవాడనై యుంటి పితరులకు పరలోకసుఖంబు, నివ్వాక భీకర భుజంగంబుచే సమసితే కుమారా! నాకడు పునః బుట్టిన నీకిట్టి కష్టంబుచావు గలిగెనే తండ్రీ! ప్రాణనాయకీ! నేనెంత దౌర్భాగ్యుండనైతినే హా పుత్రకా! ఈధరాతలంబునంతయు నీవేలుదువను కొంటినే. నీకు సామ్రాజ్యపట్టాభిషేకంబు చేయు భాగ్యుండను గాక పోతినే కిట్టి మరణంబు ప్రాప్తించెనే. నీవయోరూపలక్షణం బెన్నడుచూతు హా నేత్రరత్నమా! హా లోహిదాస్యా॥




విగతప్రాణుడగు లోహిదాస్యు నెత్తుకొని హరిశ్చంద్రుడు దుఃఖించుట.

రాజు చంద్రమతి సంవాదము - దరువు-జంఝూటి - జల్వతాళము.

చంద్రమతి॥ మానవేశ్వరతగునేనీకీమమతనికచాలింపుమా- నాను పైగలమోహాలత సుజ్ఞానశరమునద్రుంపుమా ॥మాన॥

రాజు॥ బాలరోనేనెంతపాపినభామకులమునబుట్టితీ-అలినమ్మితీనిం దబొందితి బాలకుని నెడబాసితి ॥బాల॥

చంద్రమతి॥ నిత్యమూ ఈదేహమును మరినిఖిలలోకములందును- సత్యకీర్తులబొందితి విక్రుతికృత్యుడవు నీవెందును ॥మాన॥

రాజు॥ సుగుణశీలవునిన్ను పరులకు తెగువతో దెగనమ్మితీ- తగని పాపము గట్టుకొంటిని మగువరో యీవసుమతీ ॥బాల॥

చంద్రమతి॥ తెల్లవారగవొచ్చె మనకిక తల్లడిల్లగజెల్లునే - కొల్ల కూయగసాగె ధృతిగైకొనుము నీయుల్లంబున ॥మాన॥

రాజు॥ కడకుమనకేగతులుగల్గిన విడువబోలునేసత్యము - పడతిరో బెడుదూరునిలయుని యడుగు లేగడ నిత్యము ॥బాల॥

చంద్రమతి॥ నాకునేమని సెలవొసంగెదో నాధనీకిదెబ్రొక్కెదా - శోకముడుగుముపుడమి బెడుదూరిలోకరక్షకుసాక్షిగా॥ మాన॥—మాటలు ఓప్రాణేశ్వరా! విధివశంబున వచ్చెడి దుర్దశలకుదురటిల్లుటతగునే శోకం బునకుబరిమితిలేదు. ఎన్నికష్టంబులుకల్గినా ప్రొద్దుబొడువకమును పేబోయి బనులుచేయనైతినేనియాబ్రాహ్మణుని భార్యకోపించునుగాన, ఈకొమా రునకు నగ్నియిచ్చెదగాన, సెలవొసంగుము స్వామి॥

రాజుమాటలు॥ ఓనాయకీమణీ! స్వామికార్యంబు ముఖ్యమయిన ధర్మంబు గావున, నాయేలికయగు చండాలకులపాలకుని యాజ్ఞదప్పిన సత్యహీనుండనగుదు గావున, నీవుబోయి నిన్నుగొనిన బ్రాహ్మణువేడు కొని మాడ దెచ్చియిచ్చి కొడుకును గాల్చిపొమ్ము తలోదరీ॥

చంద్రమతిమాటలు॥ ప్రాణేశ్వరా! మీసత్యమే మిమ్ము రక్షిం చును, మీచరిత్రంబు విని లోకంబునగలజ్ఞానహీనులు సత్యంబునేర్చు కొందురు. నేను మీయాజ్ఞదప్పక ఇంటికిబోయి మాడదెచ్చెదగాని, ఈ బాలుని చూచుచుండుము స్వామి॥

రాజుమాటలు॥ అట్లనే పోయిరమ్ము వాలుగంటీ॥

దొంగ సూత్రధారుని సంవాదము.

చోరుని వేషముకథ—దరువు – రేగుప్తి – ఆదితాళము.

చోరుడువచ్చెను-ధీరతతో॥ వారణాశిపురమే లేడి రాజకుమారుని ప్రాణసమీపములగోని॥ చోరు॥ బాలునిసొమ్ములుభద్రముగాతన కేలధరింపుచువాలాయంబుగ ॥ చోరు॥ నిరతము బెడుదూరినిలయునిదలచుచు పురమునబోయెడి పోలతిని పిలుచుచు ॥ చోరు ॥

సూత్రధారి॥ ఒరే! నీవెవ్వడవురా॥

చోరుడు॥ ఓయీ! మాది బెడుదూరు॥

సూత్రధారి॥ బెడుదూరైతేనేమి నీపేరేమిరా॥

చోరుడు॥ ఓయీ! మా అన్నపేరు చిక్కడు॥

సూత్రధారి॥ ఒరే! మీ అన్నపేరు నే నడుగలేదు గాని, నీపేరు చెప్పరా॥

చోరుడు॥ నాపేరు డక్కడు, నీకు తెలియదా॥

సూత్రధారి॥ నీపేరు నాకెట్లు దెలుసునురా॥

చోరుడు॥ ఓయీ! మొన్నరేయి గురువులైన రామాచార్యులు, రంగాచార్యులయిండ్లకుకన్నములపెట్టను నీవు నాతోగూడ వచ్చియుండలేదా॥

సూత్రధారి॥ ఒరే! నీవు దొంగనా॥

చోరుడు॥ నేనేగాని, నీవుగాదేమోయి॥

సూత్రధారి॥ అయితే కులమేమిరా॥

చోరుడు॥ మీదీమాదీకూడా ముతరాశికులమేగదేమోయి॥

సూత్రధారి॥ ముతరాశికుల మనగా, నేమిరా॥

చోరుడు॥ తలార్లముగ దేమయా॥

సూత్రధారి॥ అయితే నీవిక్కడి కెందుకువచ్చినావురా॥

చోరుడు॥ ఈవూరిలో సందుదోవన యేమైన పయటుంబడునేమో యని యోగుచూచి పోవచ్చితినోయి॥

సూత్రధారి॥ యేమియోగురా ఒరే॥

చోరుడు॥ అయ్యగారిండ్లకు కన్నాలుబెట్టెదెగాని మరేముందయ్య॥

సూత్రధారి॥ ఒరే! నీకేనానీకులమువాండ్లందరికిని యి దేపనేనా

చోరుడు॥ అయ్యా! ఈసంగతి నన్నడుగనేల. వైపుద్వారికితే కుల వృత్తి విడుతురే॥

సూత్రధారి॥ అయితే ఇక్కడ నీగునుకులుసాగవు. బోయిరారా ఒరే॥

చోరుడు॥ అయ్యా! యేమో సందడిగావుంటే వచ్చితిగాని, ఇంక మాకడుపాతురంబున కెక్కడికైనాపోయెద. దయుంచుమయ్యా॥







డఫేదార్.　　కాశీరాజు.　　భార్య మధురవాణి.

కాశీరాజుపుత్రుని చంపిన చోరుని వెదకించుట.

కాశీరాజు దరువు—రేగుప్తి—జుల్వాతాళం.

వెడలెకాశీపురవరుండు విమలమానసుండు॥ కొడుకును జంపవిరిచిన చోరుడుయెవడని—కడువడిగానడుగిడుచును॥ వెడ॥ కటకటములునదరగను తటత్రభూకుటినిటలంబున నటియింపగ॥ వెడ॥ఇలబెడదూరీశుని దయతెలియ ఖడ్గము—తళతళమని ఝళిపింపుచు ॥వెడ॥ మాటలు॥ ఒరేడఫేదార్! ఎవడో క్రూరుం డగుచోరుండు నాయంతఃపురంబు జొచ్చి పసిబాలుని గొంతువిరచి సొత్తు లెత్తుకొనిపోయె, పత్తాతోటి దొంగను పట్టితేవలె. గాన. కట్టుబడి తలారి మొదలగు భటులకును చెప్పి ఈకార్యంబు త్రుటి మాత్రంబున ఘటనచేయవైతివేని, నీనాకరికిహానికరంబగుననిఖండితం బుగ నెంచుకొనిపోరా ॥ఒరే॥

డఫేదార్ మాట॥ మంచి దట్లనే చేసెదనుస్వామీ॥

కాశీరాజు భార్యయగు మధురవాణి వేషము.

దరువు - ఆనందభైరవి - ఆది.

తోయ్యలిబంగరగుత్తోట్లబండినముద్దు - లయ్యనుజంపెనగయ్యాళి యెవతో॥న॥ఊపసిబాలుడువాపోవజంపిరెపాపాత్ములెవ్వరో నావురాకృత మున॥క॥ఈరాత్రినామేడకేరీతివొచ్చెనో - చోరుడుశ్రీబెడుదూరీశ్వరనే॥డ

ద్విపద - మారువ.

ఓకుమారకచంద్రయోసుగుణసాంద్రనీకిట్టిమరణంబునీరజాసనుడు విధియించెనేమనివిలపింతువింక-నధికశోకాంబుధిననుముంచితేర - నీము ద్దుచూపులునీవిలాసంబు-నీమురిపెంబునునీతరితీపు - గనుగొనిసంతోషిగా నేరనైతి-ననుబాసిపోయితేనాముద్దులయ్యా- నిన్నడబాసినేనెట్లుజీవింతున న్ననీవెంటనేనరుదెంచుదాన - ధరణిలోకంబేలతనువునాకేల-పరువడిబెడు దూరుపద్మాత్ముతోడ.—మాటలు॥ కుమారా! నన్నుగన్నతండ్రీ! నాము ద్దులయ్యనాభాగ్యరాశిగానుంటివే.నీచిన్నారిమోముకన్నులారనేనెన్నడు చూతు. అమ్మా! పాలిమ్మనిమదీయ్యచేలాగ్రంబు బట్టి వ్రేలాడుచుంటివే. నన్ను దుఃఖాంబుధిలో బడవైచిపోయితే కుమారా॥

(ఈవిధంబున మధురవాణి దుఃఖించుచుండ, చోరుం డాధ్వనివిని యెచ్చటికైన బోవలయు నని యరుగుచుండి. మాడకొరకు కాలకౌశికు నింటికి బోవుచున్న చంద్రమతికి మార్గంబున నెదుర్పడీ).

చోరుడు॥ ఓతల్లీ! ఈ నిశాకాలంబున నీవెక్కడ బోయెదవు నీ వెవరు॥ నీపేరేమమ్మా తల్లీ॥

చంద్రమతిమాటలు॥ ఓరన్నా! ఇలయేడుదీవు లేలిన హారిశ్చంద్ర మహారాజుభార్యను, నాపేరు చంద్రమతి. నాపతి సత్యవాక్యంబుకొరకు ధాత్రీతలంబువిశ్వామిత్రునికిచ్చి యమ్మునికి బాకిపడినరూకలకై ఈపురి బ్రాహ్మణునికినన్నమ్మిపోయె. నేను నాకొడుకు కడవికిబోయి మృత్యుండైన వానిగాల్చుటకు గాటికిబోయి వీరబాహున కివ్వవలసినమాడకై ఇంటికి బోవుచున్నాను. నీవెవ్వడవన్నా! పుణ్యాత్మకా॥

చంద్రమతిని దొంగ యని తలవరులు పట్టుకొని పోవుట.

చోరుఁడుమాటలు॥ అమ్మా! నేనెవఁడైననేమి నీవునాసోదరివైతివి. నీకు మాఁడ నేదెచ్చియిచ్చెదగాని, ఈమాటగైకొనవమ్మా॥ ఒరేతలవరులారా! పత్తాతోటి దొంగ చిక్కినది రాండ్రా ఒరేకట్టుబడీ॥

కట్టుబడీ దరువు - నాట - జుల్వతాళము.

ఎంతహంతకారివె-యింతిరాజుముద్దుపట్టి - గొంతువిరిచిసొమ్ము గైకొంటివెందుబోయెదింక॥ఎంత॥ రక్కసివోగాక కాళరాత్రివో నీవు - బాలుచిక్కబట్టిచంపనీకుచేతులెట్లాడెను॥ఎంత॥ వారక బెడుదూరుశౌరికోరిమదినెరుంగ లేక- చోరకార్యమునకు నెట్లుజొచ్చితి వేమిటుకులాడి॥ఎ॥ మాటలు॥ ఓయింతీ! ఇంతటిదురంత కార్యంబుచేయుటకునీకుచేతులెట్లాడెనేరక్క నీకొడుకులు లేనిగొడ్రాలై నాపసిబాలునిగొంతువిరుచునా. మాచేజిక్కితి నింకెక్కడబోయెదవు. నీపిడికెట్లలనువిరిచికట్టి కాశిరాజుకట్టెదుటిరి పట్టుకొనిపోయెదము బాలఘాతికీ॥

తలారిమాటలు॥ ఒరేకట్టుబడీ! ముందువెనుకు తెలియక ఈసుందరాంగిని యేలబాధించెదవు. కొంచెముసేపు నిధానించరా॥

సంవాదము - దరువు - శ్యామకల్యాణి - ఆది.

కట్టుబడి॥ ఒరే దీనివిడువరాదురా-యీధరాధిపుని కొప్పింతము-నా కరాసితో తలద్రుంచము॥

తలారి॥ ఒరే వలదువలదురా నీవు-యీవరారోహనిటుజూడరా-సుందరా సుగుణముల ప్రోడరా॥

కట్టుబడి॥ చలోచలో బత్తలారి - నేనికబళా దొంగ గనుగొంటినీ-సాఫల్లామునీ కనియింటినీ॥

తలారి॥ హునేనునీకీక శెలరా-యీశశివదన యిబుజేసునే- ఈపసీబాల తలగోసునే॥

కట్టుబడి॥ పుడమిలో బెడుదూరినిలయుడైన వచ్చినరానిరా-యీపడతి బట్టుకపోదురా॥

తలారి॥ నిగాయుంచుమీజగతిబెడుదూరుఖగారూఢునితోడురా-మగువపై దయజూడరా॥——మాటలు॥ ఒరేహుసేనుగా! నీకింతక శెలరా. ఈసూనిని సకల సుగుణముల ప్రోడగాయున్నది ఇట్టి లక్షణంబులుగల పడతి రాజుకొడుకు గొంతు విరుచునే. యెక్కడిమాట. యెవడో మంచి ఘాయి ఈపనిజేసి దక్కించుకొనజాలక ఈమెపై సొత్తులమూట బార

నైచి పోయియుండవచ్చు, నీవేల ఈమెను బాధించెదవురా. నీ కేమైన ఆశయుంటే చెప్పరా యిప్పించెద. ఈమెను విడువరా ఒరే॥

కట్టుబడినమాటలు॥ ఒరేతలారి! నీ కేయూలరకుండుము పత్తాతో దొంగనుపట్టి విడిచితే రాజుశిక్షించునుగాని విడుచునే కాబట్టి. ఈబాల ఘాతకిని బట్టుకొనిపోయి రాజునకొప్పింతము. దొరలచిత్త మేరీతినుండునో॥

తలారిమాటలు॥ అయితే మంచిదటులనే చేతమురారాకట్టుబడీ॥

దొంగతనము మోపబడిన చంద్రమతిని మధురవాణి నిందించుట.

తలారి కట్టుబడినమాటలు॥ రాజేంద్రా! పత్తాతోటి దొంగను పట్టి తెచ్చితిమి. మాకేమి సెలవిచ్చెదవో. స్వామీ॥

మధురవాణి దరువు—ఆనందభైరవి—అట.

రక్కసివై బుట్టినావా—ఓసి—పెక్కు బాలురజంపి పేరుపొంగితివా! రక్క॥ కాళరాతిరివినీవై తే—పసి—బాలుని యేలీలపట్టిచంపితివే॥ రక్క॥ ఆడదానవుమిరారీ—నా—మేడ జేరితి నీవెట్లు మిండలమారీ॥ రక్క॥ బెడుదూరు శౌరిసాక్షిగను—నీవుకడుపాపమతివేయీకాంతలలోన॥ రక్క॥— మాటను॥ ఓరక్కసీ! నీవెక్కడనుండివచ్చితివేపాపీ! కడుపసిపాపని మెడవిరిచి పుడమిలోనీవేసుఖంబనుభవింప చూచెదవే ద్రోహీ! నిర్దయాకాలి వగు నిన్నెంతమర్దించినా మదితాపంబు దీరదే మాయలాడి! ఆడదానవై పుట్టి యీనెట్టినిష్ఠురకార్యంబు చేసితివే కట్టడీ! పుడమిలో. యెందరికడుపులు గాల్చివచ్చితివే మిండలమారీ! యెంతసాహసంబు గలదానవే హా! యెంత కారీ!

కాశీరాజుమాటలు॥ హా! యిట్టిసౌందర్యవతి దొంగతనంబెట్లు చేసె. ఈరాత్రి నామేడ కెట్లుచేరె. నెత్తురుకసికందగు నానందను నెట్లు కుత్తుక కత్తరించి మృత్యువిట్టిరూపం బెత్తె కాబోలు, ఆహా! కాలవిపర్యాసంబు చూడ చిత్ర మయ్యె. బాలులబ్రతు కెంత నమ్మకము లేక బోయె. ఆడదొంగ నెన్నడును జూచియుండలేదు. పురుషులకన్న నారింతలు సాహసం బాడవారికి కలిగియుండు ననుమాట నిజమాయె. ఒరే కట్టుబడీ! ఈబాలఘాతిని మొగమాటంబు చూడదగదుగాన, శీఘ్రంబున నాకంటెదుట నుండనియ్యక కట్టుకొనిపోయి వీరబాహునిచేత తల తెగగొట్టింపరా ఒరే॥

కట్టుబడిమాటలు॥ మంచిబుద్ధి మీహుకుంమేర కటులనే జేసెదను స్వామీ॥ ఒరే వీరదాసుడా! ఈచిన్నదీ కాశీరాజకుమారునిజంపి సొమ్ము

లెత్తుకొనివచ్చినది. గావున, రాజాజ్ఞచే దీని తల తెగ నరుకు మని వీర బాహుని సెలవైనందున నీకొప్పించితినయ్యా॥

వీరదాసు డను హరిశ్చంద్రుని దరువు.

శుద్ధకాంభోజి-జంపె.

ఎటువంటిద్రోహినే యలనాగరో నేను కుటిలకుంతలరో నిన్ను-చటులఖడ్గముతోడ నెటువలెను తలద్రుంతు కటకటా నీవిధిని గడువగా లేనైతి॥ఎటు॥భామరో వినుమింక భార్యజంపిన పాప మీమహిని నన్ను బొందు-తామరసనేత్రి నీతల దునుమ కుంచినను స్వామిద్రోహముకదా యేమందుమ నావిధికి॥ఎటు॥శరణన్న నెటువంటిశత్రువునినైన నేకరుణచే ధరణిలోన పరగ రక్షించితిని హరిహరీ-బెనుదూరిపురవాసు డెరుగ నిజ తరుణిజంపగవలసె॥ఎటు॥—మాటలు॥హాదైవమా! కులకాంతను జంప వలసె. ఇట్లు జేసితినేని స్త్రీహత్యచేకూరును. ఈసతిని రక్షించితినేని, స్వామిద్రోహంబు గలుగును ఈరెండుపాపంబులలో నొక్కటి బొంద వలసివచ్చెనైనా ప్రకృతంబున నేకార్యంబుచేయ నిశ్చయింతునురా స్వామీ॥

చంద్రమతి-సీ॥ఇదిగదా వేళరమేశనిర్హైతుకప్రభవకటాక్షసంప్రాప్తమునకు। ఇదిగదాసమయంబుత్రిదశేంద్రగృహవాసయోగనిర్నిద్రసౌభాగ్యమునకు।ఇదిగదాయదునుమర్మదజారచోర ప్రకంపనభయదీయఖడ్గమునకు। నిదిగదా హేతువువిదితచతుర్దశభువనభాసితయశఃపుంజమునకు।నిర్వ్యాజకృతస్వామినిఖిలకార్య।ధర్మసంగ్రామవిజితారిధరణినాధ। దండనీతిస్ఫురద్బాహుదండవిభవ।సూనృతత్రాణమామక ప్రాణనాధ॥—గీ॥ నా మనోహరనాప్రాణనాధయింక ।నేలచింతిల్లెదవు భూమిపాలతిలక। నాకు మరణంబునీకృపాణంబుచేత। గలుగ వ్రాసెనుమేలయ్యెగమలభవుడు॥—మాటలు॥ఓప్రాణనాయకా! నీవెరుంగని ధర్మంబు గలదా. స్వామికార్యంబుముఖ్యధర్మంబై యుండును. తొల్లి భూదేవి స్వామిద్రోహిని భరింపజాలనని గరుడవాహనునితోడ మొరలిడిన తెరం గెరుంగరే. ఇదిగాక, ఈకాశీరాజకుమారునిజంపిన మృత్యువని పురజనులచేదిట్టుబడితి గాన, మీ రనుమానింపక మదీయశిరంబుగ్రక్కున దెగనరికి సత్యాత్ముండవుగముల. నీకిదిప్రదక్షిణనమస్కారంబుచేసెదస్వామీ॥—గీ॥నీర జాప్తవిభుమునేపతివ్రతనైతి।నేనీకరుణనన్ను నెలమిబ్రోచి। జన్మజన్మము

నకుజనసుతుండగు। హరిశ్చంద్రుభార్యగాక సంఘటింపు॥—మాటలు॥ ఓ ప్రభాకరా! సూర్యదేవా! నే పతివ్రతనేని జన్మజన్మంబునకుసత్యసంధుం డగు హరిశ్చంద్రమహారాజుచక్రవర్తి నాజీవితేశ్వరుండగు నట్లుగననుగ్రహింపుము స్వామి॥

రాజుమాటలు॥ అహా! దైవమా! స్వామిద్రోహంబునకు వెరచి కులకాంతను తలదెగనరికెద నన్ను దురితంబు పొరయకుండ రక్షింపుము స్వామి॥

విశ్వామిత్రునిగీతము॥ ఓహరిశ్చంద్ర యిదియేమి యుచితమయ్యా। కటికవాడై ననిటుకులకాంతజంప॥దలచు నేయింక చాలింపుతగదుతగదు! నీ గురుండిట్లు చెప్పె నేనేర్పు బోడ॥—మాటలు॥ ఓహరిశ్చంద్రా! ఈతలోదరిని జంప దలంపుపుట్టనే ఇట్టి దుష్కార్యంబు చేయుమని నీగురుండు చెప్పెనే అంకురితవైరిరాజకంఠీరవ కంఠంబుల దెగనరికెడినీకరకలిత కృపాణంబు కడకు నీకులసతి వధకు తగియెనే. కటకటా! ధర్మార్థ కామమోక్షంబుల కాస్పదంబగు ఈభర్మగాత్రిని వధించుటనీతియే. సూర్యకులంబునఁ బుట్టి సూనృతవాదివై భంగపాటునకోర్చి చండాలునికి సేవకుడవై భార్యనుజంపి ఏసుఖం బనుభవించెదవు. ఇంకనైన నాకూతురగు మాతంగకన్నియల వరింతువేనినీతనూజానుతుని బ్రతికించినిన్నునిఖలభూమండలంబు నేలింతు నయ్యా హరిశ్చంద్రా॥

రాజుమాటలు॥ ఓవిశ్వామిత్ర మునీంద్రా! ఈకాశీపురాధీశ్వరుం డగు సదాశివుండు మదీయ్య సంసార ఘోరవారాసి దరిసఁ జేసి నన్ను దరిజేర్పఁ గలండు. మీరు పదేపదే బల్కెడు మాటేగాని క్రొత్తమాట గాదు. ఇతరునివలెనన్ను భ్రమియింపఁ జూచెదరు మీకెదురాడ నేరతు. నావిన్నపంబు మన్నించి కత్తివిడిచి పోయిరండు. మీకిది పదివేలవంద నంబు లాచరించెదను మహాత్మా॥

విశ్వామిత్రునిసీ॥ఘననిష్టచేతరుద్రునిగూర్చి చేసినఘోరతపంబును కొల్లబోయె। పంచాగ్నిమధ్యమం దంచితగతినిల్చిసల్పిన జపమెల్లసమసె నకట। సంవర్తసమయావసరజన్య కీలికాసమమైనకోపంబు చల్లనాయె। దివిజనాదాదికదిక్పాలకాభేద్యభయద ప్రభావంబుమగ్నమయ్యె। బ్రహ్మ రుద్రాదులనుభయభ్రాంతిజలధి। ముంపజాలినమహిమయుంగంపవలసె। కలలోకంబులనుగెల్వజాలునట్టి। మాయలన్నియు నేటితో మాయమాయె

మాటలు॥ అకటా! బ్రహ్మరుద్రాదులకైన చిక్కులు బెట్టెడు మదీయ్య మాయాప్రభావంబు కృతఘ్నునకొనర్చిన మేలునుంబోలెనీహరిశ్చంద్రు నెడ విఫలంబయ్యె. ఔరా! నేనెన్నిమాయలు బన్నినా కడపటి కీతని బొంకింపలేకపోతినే. యెంతో ప్రయాసపడి చేసిన ఘోరతపంబులో సగ భాగం బీతని కియ్యవలసివచ్చెనే. తుదకు వసిష్టుడే గెలిచెనే. దైవమా! యింకేమి చేయుదురా హరిహరీ॥



పార్వతీ పరమేశ్వరులు.



మహావిష్ణు



హరిశ్చంద్రుడు చంద్రమతిశిరంబు తెగవరుకుట.



విశ్వామిత్రుడు.

త్రా॥మాటలు॥పదివేలువందనంబులు. శంభో! పార్వతీరమణా!పుండరీకాం తూ! ఫాలతీప తే! త్రిమూర్తులగు మిమ్ముగొనియాడుటకు నే నెంతటివాడను. యపరాధంబులు క్షమింపుడు మహాత్ములారా॥

పరమశివుడు—క॥ పదునాల్గులోకములలో। విదితంబుగనిన్నుబోలు వీరుడుగలదె। సడమలసత్యాత్ముడవని। మదిదెలిసితినయ్య భువనమాన్య చరిత్రా॥—మాటలు॥ హరిశ్చంద్రమహారాజా! నిన్నుబోసిన భూపాలుం డీలోకంబున నైనగ గలడే నీసత్యసంపద పదునాల్గుభువనంబులు నిండి నిబిడీకృతంబై యున్నది. సుర గరుడ గంధర్వముని సిద్ధసాధ్యులు అందరు మెచ్చి నికవరంభిచ్చెద నడుగుము రాజేంద్రా॥

రాజుమాటలు॥ ఓ దేవా! శంకరా! కైలాసప తే! చండాలకులో త్తముసేవకు డైన నన్ను దాకి గౌరవించుట తగునే మహాత్మా॥

పరమేశ్వరునిమాటలు॥ఓరాజన్యతిలకా! భసియంగ రాగంబుతో గజచర్మంబుధరించి భూతగణంబులు భజియింప ప్రేతభూమిని వసియిం చెడి నన్నుబోలినవాడవు నీవు. నీకుగల దుస్థితి కౌశికునిఇంద్రజాలంబుగా నెరుంగుము. సత్యవ్రతంబు దెలియుటకు గాధేయుండు నిన్నిట్లుబాధించె. ఇది యజ్ఞవాటంబుగాన, ప్రేతభూమిగాదు. నిన్నేలువాడు దండధరుండు గాని, చండాలుండుగాడు, ఈ పతివ్రతాతిలకంబునుకొనినవాడుకలిరాజు గాని, భూసురుండు గాడయ్యా! నీకు దివ్యదృష్టి యిచ్చెద. వీరి నందరిని చూడుము రాజేంద్రా॥

రాజుమాటలు॥ ఓభక్తవత్సలా! మీపాదదర్శనంబుచే నాయజ్ఞా నాంధకారంబు బాసి ధన్యుండ నైతి నాకు మీపాదసేవదప్ప నితరంబు నేనొల్లస్వామీ॥

పార్వతీదేవిమాటలు॥ ఓపరమేశ్వరా! చూచితే ఈ హరిశ్చంద్ర మహారాజుసత్యంబిట్లుండనిమ్ము, ఈతనికులసతియగు చంద్రమతి శీలంబు గంటిరే ఫాలనేత్రా! ఈబాలికామణి బాలునిదుఃఖంబుచే ప్రలాపించు చున్నది. కౌశికునిమాయచే చిక్కుబడినను పాతివ్రత్యమహిమచే ధృతి జెడకయున్నది. ఈయువతిసుతుని బ్రతికింపుము స్వామీ॥

పరమేశ్వరునిమాటలు॥ ఓపార్వతీ! నీవుచెప్పిన ప్రకారంబుగ ఈ పుణ్యసతిని గారవించి కోరినవరంబిం త్తమురమ్ము వారిజాక్షీ॥

పార్వతీదేవిమాటలు॥ పదండిస్వామీ॥

పరమశివునిమాటలు॥ ఓచంద్రమతీ! నీపతివ్రతామహిమ కేము మెచ్చితిమి. నీయుల్లంబున కోరినవరం బిచ్చెద మడుగువమ్మా తల్లీ॥

చంద్రమతిమాటలు॥ ఓ దేవా! పార్వతీ రమణా! నాకువరమిచ్చెద వేని, కాశీపురం బేలెడి రాజకుమారుని బ్రతికించి నానిందమాన్పు మిందుశేఖరా॥

పరమశివునిమాటలు॥ దీర్ఘసుమంగలీభవ అమ్మా చంద్రమతి! నీ పతివ్రతామహిమచే కాశీపురాధీశ్వరుని కుమారుండు బ్రతికియున్నవాడు. గావున, మాయనుగ్రహంబునతక్షకునివిషాగ్ని చల్లార్చినిద్ర మేల్కొనిన చందంబున నీనందనుండగు లోహిదాస్యుండు బ్రతికివచ్చె చూడవమ్మా తల్లీ॥

చంద్రమతి - లోహిదాస్య సంవాదము.

మత్తకోకిలవృత్తము॥ బాలకానినుగంటినాదగుభాగ్య మేమని చెప్పు దుర్॥ చాలానాతొలినోముపండి సంపదేమనవచ్చునా। శీలుండౌ బెడు దూరు నేలినశ్రీరమాదిపుసాక్షిగా। పోలనిన్నిటజూడగల్గెను పూర్వపుణ్య ఫలంబునన్॥—మాటలు॥ ఆహాలోహిదాస్యా॥ నాముద్దులకుమారా! నా దైన పూర్వపుణ్యఫలంబునను, ఈ పార్వతీవర మహేశ్వరానుగ్రహంబునను, మరల నీవు బ్రతికితివి తండ్రీ॥

లోహిదాస్యునిమత్తకోకిలవృత్తము॥అమ్మరోవినవమ్మకానసమం దేవటవృక్షముల్! సమ్మదంబునబ్రాకగానొకసర్పముద్ధతినాదుపా। దంబు నన్‌గాటొందె నేనటతాల్మిదూలి వసుంధరన్। సొమ్మసిల్లితినేమిచెప్పుదు చోద్యమిప్పుడలేచితిన్॥—మాటలు॥ అమ్మా! నీవు బంపగా బోయి యడవిలో నాకులకొరకు మఱ్ఱిచెట్టుగ బ్రాకుచుండగా నన్నుపాముగరిచె నంత నిన్ను తలంచుచు తెలివిదప్పి నేలన్ బడితి. ఇంతవరకు నిద్రించి యిప్పుడు లేచితినే తల్లీ॥

విశ్వామిత్రునిమాటలు॥ ఓహరిశ్చంద్రమహారాజా! నాకారణం బున నీవెంతబాధ పడితివయ్యా నీసత్యంబు దెలియుటకై యిన్నికష్టంబులు పెట్టితి నాయపరాధంబు క్షమించి నీవయోధ్యకుబోయి పట్టాభిషిక్తుండ వై రాజ్యమేలుము రాజేంద్రా॥

రాజుమాటలు॥ ఓవిశ్వామిత్రమునీంద్రా! మీరిటులాడుట తగ వగునా. నేదత్తాపహారంబు చేయుదునే మీకిచ్చినరాజ్యంబు మరల నే

# కాసా.



కాసము దగ్గు మొదలగు వ్యాధులకు ఘనతపొందిన యీమందును మళయాళ అష్టాంగ పద్ధతి ప్రకారము మిగుల జాగ్రత్తతో తయారు చేయబడ్డది దగ్గు శ్వాసకాసము, కఫము గొంతెణుచుట గొంతుకమ్ముట, గొంతు నొప్పి రొమ్మదురుట మొదలగు వ్యాధులను గుణపరచును.

గుండెలోను గొంతులోను శ్వాస నాళములయందును ఏర్పడు రణములనుమాన్పి దగ్గును తనిచేసి కఫమును అడుగుతో పోగొట్టును. గళ్లతోటి రక్తము వచ్చుట గళ్ల, పసుపువర్ణముగా వచ్చుట ఆయాసముగా యుండుట బలహీనము శరీరము చిక్కిపోవుట వూపిరి తిరుగకయుండుట కాళ్లుచేతులు ఆశక్తి క్షయము కఫజ్వరము మొదలగు వ్యాధులను గుణపరచి రక్తమును శుద్ధిచేయును. దీనిని వుపయోగించి నిశ్చయమును తెలుసుకొన్న వారికే దీని మహిమ తెలియును. స్త్రీ పురుషులు భోంచేయు తగిన మందు.

20 దినములకు 40 పూటలకు మందు ధర **2-8-0**

# సుఖవిరేచన మాత్రలు.

ఇవి శ్రేష్ఠమైనవి. బిడ్డలకు 1-2 మాత్రలను పెద్దవారలకు 8 మాత్రలును పుచ్చుకొనిన సుఖముగా 2=8 మారులు విరేచనమౌ ఆజీర్ణ వాయువు జలుబు జ్వరము మొదలగు వాటిని హరించును. సీసా **1-0=0**

# భోగశోక నివారణీ మాత్రలు.

సంభోగమైనతోడనే ఈ మాత్ర ఒకటి పుచ్చుకొని పాలు అయినను చల్లని నీళ్లయినను త్రాగినయెడల సంభర్గమువలన కలిగిన నీరుచురుకు కాళ్లుచేతులు దుర్బలమగుట, ఉష్ణము మొదలయిన వ్యాధుల నివృత్తిచేసి 10 నిమిషములలో మరల భోగ సుఖం కలిగించును. ఒకతూరి ఉపయోగించిన పిదప గుణము మీకే తెలుసుకొనగలరు. పథ్యములేదు.

20 మాత్రలు **1-0-0**

# మూలరోగ సంజీవి లేహ్యము.

లోపలిమూలము, బయటమూలము, చీముతోచేరిన మూలము, చెట్టుమూలము, రక్తమూలము మొదలగు పాతరోగములను సకలవిధ దేహావుష్ణములనున్న, మూలరోగము అన్నిస్థితిలో నీరతున్నను మా ఔషధమువల్ల నివర్తించును. **2-0-0**

---

ఎస్. వి. గోపాల్ అండు కో., 63 కృష్ణప్పనాయకన్ గుంటవీధి, మదరాసు.

# డీసెంట్రిల్

జిగటవిరేచనాలు, నెత్తురబంక విరేచనాలు రక్తభేది, మూల శంకమూలంగా మలంతో నెత్తురుపడుట, జిగురు నెత్తురుకలసి భేదులగుట, కడుపునొప్పి, ఆసనంతవు మూలవ్యాధి, నోరు పేగులు మూత్రద్వారాలలో పుండు అగుట, సెగరోగము, వేడి అధిక ఋతురక్త స్రావము, మర్మాయవములలో పుండు దురద మున్నగువేడి జబ్బులకు, తప్పక కుదుర్చును. చిన్నపిల్లలు మొదలుకొని పెద్దవారివరకు ఎల్లరుఎవరయిను వారైనను సేవించవచ్చును. నాలుగు పూటలలో మందుతప్పక గుణమిచ్చును ప్రతివారిదగ్గరఉండతగినది. బుడ్డిఒక్కటికి రూ 2—0—0

# ధాతువృద్ధి మాత్రలు.

ఈ మాత్రలను ప్రతి దినము ఉదయం పాలలోగాని నీళ్ళలోగాని 1. మాత్ర చొప్పున సేవించుచుండగా వచ్చినయెడల ధాతువును బలపరచి నరములకు బలమునిచ్చి రతికేళి సుఖమునందు ఆనంద భరితునిగాచేయును. కృశించిన దేహమునకు బలమునిచ్చి ముఖమునకు తేజస్సు కలుగజేయును. మూలమునకు హేతువైన వుష్ణమును తీసివేయును దేహము చల్లబడి రక్తవృద్ధి కలుగును. 1-0-0

# మలవిసర్జన లేహ్యము.

ఈ లేహ్యమును 5 యేండ్ల బిడ్డలు మొదలు వృద్ధులవరకు స్త్రీలు పురుషులు పుచ్చుకొనవచ్చును నోటికి యింపుగా నుండును కాళ్ళు చేతులు పోటులు గర్భవాయువు, మూలవాయువు; అపానవాయువు, గుల్మవాయువు కడుపులో యెప్పుడున్ను సంకటముగ యుండుట, మలబంధము, మలశుష్కము మొదలుగాగల సమస్త వ్యాధులు నివృత్తిచేయును మలబంధములేక నానాటి మలమును నానాటికే విసర్జనముచేయుచు పాతమలమునువుంచక కడుపును శుచిచేయును. డబ్బి 1-కి రూ 1=0-0

# చెవినొప్పి తైలము.

చెవిలో చీము ఉన్నయెడల సోబును కరుగదీసి ఆజలమును సిరంజిలోపెట్టి చెవిలోవిడచి కడిగి తడిలేక తుడిచి దూదిపెట్టి అణచవలయును. చెవి, గొంతు, వాతనొప్పికలిగియుండిన నీళ్లుకాచి కంబళితో తడిపి పిండివేసి వేడి ఆరకమునుపే ఒత్తించవలెను నొప్పియున్నచోట ఆలివ్ నూనె పరుమవలయును నొప్పిస్వస్థమగునంతవరకు ఔషధము రాయవలయును. 2 బుడ్లు 1=0=0

---

ఎస్. వి. గోపాల్ అండు కో, 63. కృష్ణప్పనాయకన్ గుంటవీధి. మదరాసు.

# కామకల్పతరువు.

హస్తప్రయోగాది దురభ్యాసం వల్లనూ, అధికమైన ఉష్ణంవల్లనూ వీర్యంపలచనై సంభోగసుఖాన్ని పోగొట్టుకొనుట, శీఘ్రస్ఖలనం, స్వప్న స్ఖలనం మున్నగు రోగాలచే పీడితులగుచుందురు.

అట్టివారికి ఈమందు తయారు చేయబడినది. ఇది మలయాళ మూలికలతో ప్రాచీనాయుర్వేద పద్ధతిని శాస్త్రీయముగా తయారైన గొప్ప ఔషధ రాజము.

దీనిని స్త్రీ పురుషులు నిరభ్యంతరముగా వాడవచ్చును.



వీర్యనష్టం, ఋతుదోషం, నరముల నిస్సత్తువ, శెగరోగం, మూత్రదోషం మొదలగు వ్యాధులకు ఈమందు అమృత తుల్యము వంటిది.

మూత్రముతో పోవు శుక్లమును, మేహదుర్నీరును, మేహవ్యాధిని, మేహదురదను, జననేంద్రియ సంబంధమైన రుగ్మతలను లింగం సన్నబడుట, చిక్కి పోవుట లేపనశక్తిలేమి, స్వప్నస్ఖలనం, హస్తప్రయోగాదులచే వీర్యంపలుచబడి ఉండుట, మధుమేహం, ధాతువృద్ధికరణము లేకుండుట, స్త్రీల ఆర్తవదోషాలు నరముల నిస్సత్తువ మున్నగు వ్యాధులను ఇది తప్పక కుదుర్చును. మేహకాక, మూలకాక, గుండెదడ, వెన్నునొప్పి, దగ్గు, శ్వాసము మున్నగు బాధలను నివారణ చేయును. నరములకు బలముకూర్చి సంభోగశక్తిని హెచ్చించును.

ఆకలిలేమి, మలబద్ధకం, సీరుకట్టు, లింగ కురుపులు, నడుము నొప్పి, కాళ్లు చేతులు తీట, తెలుపువ్యాధి, తలత్రిప్పుట, జ్ఞాపకశక్తి తగ్గుట మొదలయిన బాధలను నివారించి బలాన్ని ఆరోగ్యాన్ని దేహకాంతిని తేజస్సును కలిగించును. 30 రోజులకు డబ్బి 1-కి 3—0—0

---

**ఎన్. వి. గోపాల్ అండు కో.,**

**నెం. 62, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, మదరాసు-1.**